

మేకలకాపరి

— ఫొటో : కావూరి గోపాలకృష్ణమూర్తి — బాపట్ల.

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతిక 4 అ.



సచిత్రవారపత్రిక

**Founder : K. NAGESWARA RAO**

సంపుటము 48
సంచిక 11
**10-11-54**

జయ కార్తీక శుద్ధ పౌర్ణమి బుధవారం


ఎలక్ట్రిక్ సాలీడు

ఫోటో:—పి. రామారావు, రాజమండ్రి.

# కాలక్షేపం

"వాజి చలస్వభావు లగువారు,
ప్రసన్నులుగారు భూపతుల్;–
రాజసవృత్తి మానరు; – దురాశయు
నెక్కుడు మాకు సొమ్ముపై;–
తేజ మడంచు వృద్ధదశ;–
దీకొని ప్రాణమునొంచు గాలు; – డ
వ్యాజ తపంబుకన్న భువి
నాత్మ హితంబగు కృత్యమున్నదే?"

తా॥ రాజులు గుఱ్ఱమువలె పరుగెత్తెడి గుణము స్వభావము గలవారు కనుక, వారు శాంతచిత్తులై అనుగ్రహించరు. వారి అధికారాహంకారమును వారు మానరు. మాకు సొమ్ముపై ఉండకూడనంత ఆశ అధికముగా ఉంది. వార్ధక్యము అనేది శరీరములోని తేజస్సును అణచివేస్తోంది – యముడు ప్రాణమును లాంగదీయుచున్నాడు. కనుక, ఏ కోరికలు లేకుండా తపస్సు చేస్కోనుట కంటె, ఆత్మవికాసదాయకమైన పని యింకొకటి యీ ప్రపంచములో ఉన్నదా?

"ఆడలేక మద్దెల ఓడు" అనే పద్ధతిలో మాట్లాడడం మంచిది కాదంటారు. తియ్యని ద్రాక్షపళ్ళ గుత్తులు తనకు అందలేదనే కారణంచేత ఒక నక్క ఆ ద్రాక్షపళ్లు మంచివి కాదన్నది. అవి కేవలం పుల్లని ద్రాక్షపండ్లని కల్ల ప్రచారం సాగించింది. ప్రభువులు రాజ్యాధికారాతిశయంతో ఉంటే ఉండవచ్చు – మనకు వారు అందుబాటులో లేకపోవచ్చు – మనం "దేహి" అంటే వారు "నహి" అని శూన్యహస్తం చూపించవచ్చు – మనం "పాహి! పాహి!" అంటే వారు "పోరా! పాపి!" అని తరిమివేయవచ్చు. వారిని ఆశ్రయిస్తే, ఆశ నిరాశ కావచ్చు.

కాని, రాజ్య ప్రభుత్వాధికార భారం వహించేటటువంటి రాజు ఒకడు ఉండవలెనా? అక్కరలేదా? వంటచేసే వాడుగాని వడ్డించేవాడుగాని ఒకడు ఉండి తీరాలి. వడ్డించేవాడు మనవాడయితే, కడపంక్తిని కూర్చుండినా నష్టములేదు. రాజుగారి అనుగ్రహం అనేది ఉన్నట్లయితే ఆస్థాన పండితులలో ఒకడై ఆయన కుడిభుజమై, ఆయనకు నర్మసచివుడై, ఆయనకు గుండెకాయయై, ఆయనే యీయన, యీయనే ఆయన అన్నట్లుగా వ్యవహరించవచ్చు: రాజ్యం అంతా మంత్రిగారికే ఒప్పగించి ప్రభువుగారే ముక్కు మూసికొని "కృష్ణా! రామా!" అనుకొనుచూ తపస్సు చేసికొన్నటువంటి ధరణీపతులు కూడా ఉన్నారు. అయితే ఆ విధంగా రాజుగారు తాను నమ్మిన బంటుకు, తన అంతేవాసికి, తన కిష్టుడైన శ్రేష్ఠునకు, కోరినంత యిస్తే యివ్వవచ్చు. దానకర్ణుడనని అనిపించుకోవచ్చు. కర్ణుని చెవికుండలములను దొంగిలించుకొని పోయినట్లయితే, కర్ణుని తేజము, కర్ణుని పరాక్రమము దివాలా తీస్తాయి. అటువంటి కర్ణుని కుండలములను ఎత్తుకొని పోతుంటే కర్ణుడు ఊరకున్నాడు. బలిచక్రవర్తి భూదానం చేశాడు. కాని, యకరాల లెక్కను దానం చెయ్యలేదు. మూడు అడుగుల మేర దానంచేసి, మహాత్యాగి అయినాడు. అయినా, ఆయనవద్దకు వచ్చి యాచించిన వాడుకూడా 'మూడు అడుగులు మాత్రమే దయచేయించండి' అని అడిగియున్నాడు. అందువల్ల అడుగు మాత్రమే యిచ్చినటువంటివాడు గొప్ప దాత కాదన్నాడు ఒక కవి. అడిగినంత మాత్రమే యిచ్చినట్లయితే అందులో ఔదార్యాతిశయంలేదు. అంతేకాదు. అడుగుల లెక్కను కొద్దిగా నేలయివ్వడం ఒక ఘనకార్యం కాదు. కర్ణుడు ఆ వేళ కటుదోచినంతమాత్రమే యిచ్చాడు. అనగా మోసంచేసి దోచుకొనిపోయినంతమాత్రమే "కృష్ణార్పణం" అన్నాడు. తనకు ఆ వేళ కేదో తోచినంతమాత్రమే త్యాగం చేశాడు. కనుక కర్ణుడుకూడా ఒక గొప్ప త్యాగి కాదన్నాడు.

ఈవిధంగా ప్రభువైనవాడు ఎంత త్యాగంచేసినా, ఇచ్చినదానికి మెచ్చేవాడు లేకపోవచ్చు – పూర్వ మొక ప్రభువు ఆశతీరని ఒకభూసురునకు ఏనుగను దానమిచ్చినాడట. అప్పుడా బ్రాహ్మణుడు ఏనుగు నెక్కినంతగా సంతోషించాడు. తనకంత రాజసన్మానం, గజరాజ ప్రదానం జరిగినందుకు, నాడు పేరోలగంబున పొంగిపోయినాడు. ఆ రాజసభలో అతనికి నీరాజనమిచ్చినట్లుగా ఆనందించాడు. కాని, సభ ముగిసిన పిమ్మట, ఆ బాపనిపని రసాభాసఅయింది. "అయ్యా! ఈ ఏనుగును తమరింటికి తోలుకొని వెళ్లండి!" అని దివాన్‌గారు ఉత్తరువిచ్చారు. దివానొక జవానునుకూడా వెంట యిచ్చాడు. కాని ఆ భూసురేంద్రుడు ఆ కరికరీంద్రము నెక్కుటకు భయపడి బిక్కమొగము వేసి దిక్కులు చూడడం ప్రారంభించాడు. అంతేకాదు. ఆ ఏనుగును తనయింటికి తీసికొనివెళ్లి పెరటిలో ఎక్కడ కట్టివేయగలడు? తన కొంపకూడా కూలదోసే ఏనుగ అది. ఆ గజం మదమెక్కితే తనమీదనే ధ్వజం ఎత్తవచ్చు. అంతేగాక, దానికి మేత ఎట్లా పెట్టడం? రోజుకు పదిరూపాయల నోటు ఫయిసలా అయ్యేటట్లుంది – ఇదంతా తలుచుకుంటే, ఆ బ్రాహ్మణునకు తన కంటి ఎదుటఉన్న ఆ ఏనుగు ఒక సింహస్వప్నంగా కన్పించింది. ఆ గజంముందర గజగజలాడిపోయినాడు. "రాజా! యీ యిభరాజమును నేను భరించలేను. ఏనుగంత అనుగ్రహం నామీద తమరు చూపించినందువల్ల నేను మీ అనుగ్రహ పీడితుడ

## విషయానుక్రమణిక

ముఖ చిత్రం:—ప్రకాష్ వారి "అంతేకావాలి"లో జి. వరలక్ష్మి.

నైనాను. క్షమించండి. మీ అనుగ్రహమూ వద్దు. మీ ఆగ్రహమూ వద్దు. మీ ఏనుగుల మీద మీరే ఊరేగండి. ఈ ఏనుగును మీరే తిరిగి తీసుకొని నాకీ గజేంద్రునితో లంకె విడిపించితే, అంతే చాలు. అదే గజేంద్రమోక్షం!" అని ప్రార్థించి, దివాన్‌గారి యెదుట దివానా వలె ఆ దివాణంలో దీనవదనుడై ఆ ద్విరదము ఎదుట యీ ద్విజుడు "భజామ్యహం గజాననం" అన్నట్లుగా, ఈ కరిరాజుకొక నమస్కారం అన్నాడు.

ఇది అసాధారణ విషయంగా కన్పిస్తుంది. కాని ప్రపంచ చరిత్రేతిహాసం యిటువంటి రసాభాసంకోశంగా ఉంది. ఎంతోదూరం పోనక్కరలేదు. బ్రిటిష్ వారు యీ దేశానికి వచ్చినది ఎందుకు? వారికి ఏనుగంత భారతదేశం లభించవచ్చని ఎంత ఎత్తుకు ఎగిరినారు? చివరకు "మాకొద్దు యీ తెల్లదొరతనము" అనేసరికి, "నాకీ రాజ్యము కావలెనంటినపేట!" అన్నట్లుగా, "మాకొగ్గీ దేశదొరతనము" అని విడిచిపెట్టి పారిపోయినారు. అలెగ్జాండరు అనే గ్రీసుదేశపు రాజు యీ దేశంమీదకు దండెత్తి వచ్చినతర్వాత, గ్రీసుదేశపు రాయబారులను కొందరిని మగధరాజ్యంలో చంద్రగుప్త చక్రవర్తివద్ద మకాముగా ఉంచాడు. గ్రీసుదేశానికి భారతదేశంనుంచి కానుకగా ఆనాడు పంపబడినవివిమిటంటే, ఏనుగలు -, భారతదేశం అంటే ఏనుగులతోనిండిన రాజ్యం అని పాశ్చాత్యులు భావిస్తూ ఉండేవారు.

ఇటీవల ఒక క్రయిస్తవ పాదిరీగారు తాను యీ దేశంలో క్రయిస్తవమతమును ఏవిధంగా వ్యాపింపజేయుచున్నాడో, భారతీయులు అనబడే అనాగరికజాతికి ఏవిధంగా చిత్తసంస్కారం కలుగజేసి వారిని తాను ఉద్ధరించుచున్నాడో వివరిస్తూ ఒక మాసపత్రికను అచ్చువేయించి, ఆ పత్రికయొక్క ప్రతులను అమెరికావంటి అప్రాచ్య (పశ్చిమ) రాజ్యాలకు పంపించి, తన పాదిరీసంఘమునకు కావలసినద్రవ్యమును పుష్కలంగా పోగుచేస్తున్నాడు. ఆ మాసపత్రికయొక్క మొదటికాగితంమీద అనగా ముఖపత్రంమీద ఒక పెద్ద ఏనుగుబొమ్మను ముద్రించి, ఆ ఏనుగుబొమ్మక్రింద *"This is India"* "ఇదే భారతదేశము" అనే మాటలు ముద్రించాడు. భారతదేశం అంటే ఏనుగంతదేశం అని ఆవాక్యంలోనిభావం. ఏనుగంతదేశమైనప్పటికీ, అంకుశంపెట్టి కుంభస్థలంమీద గుచ్చితేనేగాని, సరియైన త్రోవలో నడువదు. అటువంటి భారతదేశానికి ప్రబోధం కలిగించుటకొరకే క్రయిస్తవ పాదిరీలమైన మేము అమెరికావంటి అపూర్వ ఖండం నుండి యీ పూర్వఖండమునకు వచ్చి అపూర్వమైన దేశసేవ, ప్రజాసేవ చేస్తున్నామని చాటించుకొనుటకై యీ పత్రికమీద ఆ ఏనుగు బొమ్మను అచ్చువేసి, ఆ వాక్యం, ఆ ముఖపత్ర చిత్ర విచిత్రాంతరార్థంగా వ్రాసినా డా పాదిరి తెలివిముదిరి!

అతని విషయం ఎట్లా ఉన్నప్పటికీ, అతని తెలివి ఎంత పరిపక్వ మయినప్పటికీ, బ్రిటిష్‌వారు మాత్రము యీ దేశానికివచ్చి ఇచటి జహంగీరు పాదుషాను ఆశ్రయించారు. ఈ దేశంలో వర్తకం చేసికొనుటకై అనుమతి యివ్వవలసినదని విన్నవించి, నిలువ నీడ వేడినారు. అదిమొదలుగా వారి వ్యాపారం భారీగా సాగింది. తుపాకులతో సిపాయిలతో, వ్యాపారం సాగించారు. వీరితో పోటీగా ఫ్రెంచివారు యీ దేశంలో కోటలుకట్టి ఆ కోటలపై తమ బావుటాలు పెట్టి, భారతదేశాన్ని మూటకట్టి మోసికొని పోవలెనని ప్రయత్నిస్తున్నారు. వారు సాగించిన యీ పరగణాల వేటలో వారితో సమానంగా పరుగెత్తవలెనని బ్రిటిష్‌వారు ప్రాకులాడి, ఫ్రెంచివారికి స్వస్తిచెప్పి, పరాసువారితో చేరితే మీరు పాడైపోతారన్నట్లుగా మనకు బ్రిటిష్‌వారు తురాయికట్టి, స్వదేశరాజులకు తమ పటాలములను అంగరక్షగా యిచ్చి, మింగివేశారు—గుడినీ, గుడిలో లింగాన్నీ. చిట్టచివరకు బ్రిటిష్‌వారి సైనిక సహాయమును స్వీకరించినటువంటి స్వదేశరాజులందరూ బ్రిటిష్‌వారి సైనిక సహాయానికి స్వాహా అయినారు. బ్రిటిష్ సైనికబలం అనే తిమింగిలం ఆ చిన్న చేపల నన్నింటినీ మింగివేసింది. కాని, యీ భారతదేశంలో సముద్రతీరములందు పుదుచ్చేరి, మాహే, యానాం మొదలైన చిన్న రేవులు కొన్ని ఫ్రెంచివారివి మిగిలిపోనాయి.

భారతదేశం అనే బ్రహ్మాండమైన ఏను

# ★ కాలక్షేపం ★

గును బ్రిటిష్‌వారు ఎట్లాగైతేనేం, గొలుసులతో బిగించారు. పంచమజార్జి చక్రవర్తి ఇంగ్లాండునుంచి వచ్చి హస్తినాపురంలో పట్టాభిషేకం చేసికొన్నాడు. బ్రిటిష్‌వారు ఏనుగెక్కినారు. కాని, ఆ ఏనుగును వారు మచ్చికచేసి శిక్షణ చేసిరే గాని, భక్షణ చేయజాలకపోయిరి. గత ప్రపంచ సంగ్రామంలో, బర్మానుంచి బ్రిటిష్‌సేనలు వెనుకకు పారిపోయినాయి. జపాను సేనల దెబ్బకు ఆగలేక ఐరావతీనదీ ప్రాంతంనుంచి బర్మా సరిహద్దులుదాటి ఇండియాలోకి వచ్చాయి. అయిరావతం అంటే ఇంద్రుని తెల్ల ఏనుగ. అటువంటి తెల్లఏనుగలుండే రాజ్యం అయిరావతీనదీ ప్రాంతం – ఆ తెల్లఏనుగుల రాజ్యంలోనే, తెల్లవారిసేనలు ఒకనాటి తెల్లవారుజామున తెల్లజెండా ఎత్తినవి. ఆ బ్రాహ్మీముహూర్తంలో బ్రహ్మదేశంనుంచి మకాముఎత్తి ఎకాఎకీ ఇండియాకు వచ్చారు. ఐరావతమును దిగిరావలసి వచ్చింది. ఇక అటువంటి బ్రిటిష్ సేనలు హస్తినాపురంలోమాత్రం ఎందుకు? "భారతదేశానికి స్వస్తి చెప్పి పొండి. భారతదేశం అంటే మీకు చాలా భారమైనదేశం. దీనిని భుక్తపరచుకోవలెనంటే, మీరే దానికి భుక్తం కాక తప్పదు. మీకెందుకీ సామజకాంక్ష? ఎందుకీ సామ్రాజ్యకాంక్ష?" అని గాంధిమహాత్ముడు తన "క్విట్" గీతోపదేశం సమరమధ్యంలోనే సాగించాడు. ఆఖరుకు ఆంగ్లేయులకు మన మహాత్మునివల్లనే జ్ఞానప్రబోధం కలిగింది. "ఆయన మాకు దారి చూపించాడు." *He showed us Tle way* అని ఇంగ్లీషువారు కూడా అంగీకరించి స్వదేశమైన యింగ్లాండుకు మూటముల్లెతో సహా మళ్లీరాకుండా వెళ్లిపోయినారు.

అయితే, అంతటితో కథ కంచికి వెళ్ళినట్లేనా? సామ్రాజ్యవాదులకు అందరికీ బుద్ధి సాఫీ అయినట్లేనా? బ్రిటిష్ వారితోపాటు యీ దేశంలో రాజ్యం సంపాదించవలెననే కాంక్షతో, కలువరించి, కలహించి, "మిగిలినది తుట్టతుదకిదె – మీసకట్టు" అన్నట్లుగా పుదుచ్చేరి, మాహే, యానాం మొదలైన రేవుపట్టులు మాత్రము వారికి యీ దేశంలో మిగిలినవి. ఆఖరుకు అవికూడా వారు వదలుకొని పోయినా రీ జయ సంవత్సరంలో విజయదశమి వెళ్లిన మూడువారాల మూడు రోజులకు. ఫ్రెంచివారికి మనవారు పుదుచ్చేరిలో "రాం! రాం!" అన్నారు. ఫ్రెంచివారుకూడా ఓడ ఎక్కి ఇక మళ్లీ ఇండియాకు "రాం! రాం!" అన్నారు.

అయితే ఇంకా, గోవారేవులోని పోర్చుగీసు వారు పొమ్మంటే పోవడం లేదు. వాస్కోడిగామా అనే పోర్చుగీసువాడు మొదట యీ గోవారేవులో అడుగుపెట్టి, గోప్పాదం అంత గోవారేవును ఆక్రమించాడు. అప్పటికీ యిప్పటికీ రమారమి 500 ఏండ్లు దాటిపోయినాయి. మొట్టమొదట మన దేశానికి అయిరోపాఖండంనుంచి వచ్చి దిగిన అయిరోపియనులు వీరే. పాశ్చాత్యులందరికంటె ముందుగా వచ్చి ఇండియాలో వెండి బంగారం మూటగట్టుకోవలెనని వచ్చినది యీ బుడతకీసువారే. రమారమి శ్రీకృష్ణదేవరాయల కాలంనాటికి వీరు రాయలవారి ఆస్థానానికి వచ్చి, (హంపీ) విజయనగరం సందర్శించి "నడిబజారులో రత్నాలు రాసులుపోసి అమ్ముతున్నా"రని చూచి, "అమ్మక చెల్ల! నా హృదయ మమ్మక చెల్లదు వీరి కిర్యోవ్యడస్" అని రాయలవారితో రాయబారాలూ రాశ్ళబేరాలూ కూడా జరిపారు. భారతదేశం అంటే ఏనుగు మాత్రమే కాదు. ఆ ఏనుగు కుంభస్థలం ముత్యాలు మొదలైన మణిగణ నిలయం అని కూడా గ్రహించారు. ఇది వరహాల వృక్షం అన్నారు (*Pagoda Tree*). దీనిని కదలిస్తే వరహాలు రాల్తాయి అన్నారు. ఈవిధంగా ఆశపడి అందరికంటె ముందుగావచ్చి, ఇక్కడ సీటు రిజర్వు చేసికొన్నవారే ఈ బుడతకీసులు. ఎక్కువకాలంనుంచీ ఉంటున్నవారికి మక్కువ ఎక్కువనుట నిక్కువమే –. వారుకూడా వారం వర్జం చూచుకోకుండా యీ తీరం వదలి వెళ్ళరు –, బుడతకీసులు మడత పేచీలు లేకుండా, తోక ముడతపెట్టి వెళ్లితే, స్వర్గంలో ఉన్న రాయలవారుకూడా సంతోషిస్తారు.

ఏమైనప్పటికీ, కొంచెం కళ్లెంపట్టి ఆడించి, కదను తొక్కిస్తేనేగాని రస్తామీద గుర్రం హారాము చేయకుండా సరాసరి నడువదు –. కాతు కొద్దీ గుర్రం అనేమాట నిజం. ప్రభువులే గుర్రములైనప్పుడు వారిని సరియైనత్రోవలో నడిపించవలసినది ప్రజలే. గుర్రపు స్వభావము గలవారు వారి యంతట వారు ప్రసన్నులు కారు.

"వాజి చలస్వభావులగువారు,
ప్రసన్నులుగారు భూపతుల్;
రాజస వృత్తి మానరు."

ఆమాట నిజమే. రాజులే గుర్రాలు

---

ఒకఇల్లాలుభర్తతో: చూశారా చూశారా వాడునావైపు ఎలా సైగ చేస్తున్నాడో చూడండి.

భర్త (కోపంతో): ఎవడా దుర్మార్గుడు?

భార్య: మన చిన్నబ్బాయండీ.

---

అయితే, ప్రజలే వారికి రౌతులు కాక తప్పదు. ప్రజలు వారిని బ్రతిమాలితే వారు ప్రజలను బ్రతుకనిస్తారా? సత్యాగ్రహం సాగించి, "సత్యమేవ జయతే" అని, ప్రజలు చేసెడి "అవ్యాజ తపంబుకన్న భువి నాత్మహితంబగు కృత్యమున్నదే?" ★




ఎక్కడపుట్టి ఎక్కడ పెరిగి జీవిచాడోగాని చలమరాజు నడివీధిలో దిక్కూ మొక్కూ లేని చావు చచ్చాడు. దగ్గర బంధువులైనా వచ్చి, 'అయ్యో! కుటుంబాని కాధారమైన నీవు పంచభూతాల్లో కలిసిపోయావా?' అని కంట తడి పెట్టేందుకూడా ఆస్కారం లేకపోయింది. ఎవరో ఎక్కడో కావల్సినవాళ్లున్నారటగాని, వాళ్లు రెక్కలుగట్టుకు వాలలేదు. కారణం? ఏమైనా, చలమరాజు ఇంటో ఇనపగజ్జెల తల్లి వక్రనాట్యం వాళ్ల చెవుల్ని చిల్లులు పొడుస్తుంది. చలమరాజు అయవారం రాగిచెంబు తళతళలాడుతూ, వాళ్ల కళ్ళనించి రక్తం పిండుతుంది. బాగా ఆస్తిఉన్నవాళ్ళకే దిక్కులేకపోగా ఈ దరిద్ర దామోదర చక్రవర్తి ముఖం చూసేదెవరూ? ఈ తాతగాని వెనక నేమైనా 'లప్ప' జాగ్రత్త చేసివుంటే లబలబలాడుతూ వచ్చి, 'మేమంటే మేం' అని పంతాలాడుకునేవారు. వాళ్ల ఆటపాటలు చూచేవాళ్లకి మంచి ప్రదర్శన పర్వంగా వుండివుణ్ణు.

"అయ్యో! ముదనష్టపు డబ్బు! డబ్బు శాశ్వతమా ఏమిటి? తాతా! కలకాలం మాటమీద నిలబడాలిగాని," అని తాత్కాలిక ముద్రల్లో అబద్ధాలాడి స్వార్థంతో కాళ్లుపట్టేవాళ్ళు. ఐతే అతనలా చేయించుకోవాలనుకోలేదు. అతనిదగ్గర డబ్బేమైనా ఉందో లేదో కూడా ఎవరికీ తెలీదు. అడుక్కుతింటూ కూరావారకీ కక్కుర్తిపడి ఎంగిలికూడు తినేవాడిదగ్గర డబ్బుందని భ్రమపడ్డానికి తావులేదు.

ఏ అర్థరాత్రి గుటుక్కుమన్నాడో మధ్యాహ్నం పన్నెండింటిదాకా చీమ కుట్టినట్టు లేదు. శవాన్ని వతలికిలాగి పారేసి, అతనికి దూరంగా తిరుగుతోన్న దగ్గర దూర బంధువుల్ని లాక్కొచ్చి చూపెట్టారు. వాళ్లు మాకేం సంబంధంలేదని తోక ముడిచేశారు.

'బతికినన్నాళ్లూ అందర్నీ చంపాడు. ఇప్పుడు వీడుచస్తే ఎవడిక్కావాలి? ఎలాగో మట్టిలో కలిపేయండి' - అన్నారు.

ఏదేనా, ఈ చచ్చినవాడివల్ల అంటే దుంటే పూసుకు తిరుగుతారు. గుడిసెలో కెళ్ళిచూస్తే ఏవుంది? కారుచీకటి తారులా కారుతూవుంది. ఇంట్లో పనికిరానిసామాను తెచ్చి వీధిలో పారేశారు. ఒక పేకేజిపెట్టె - రెండు మూడు గుడ్డలు - ఒక చేతికర్ర. ఇవే ఆ దౌర్భాగ్యుడిఆస్తి... నేటితో వాటికిక స్వస్తి...

పేకేజి మూత తీసి చూశారు. అందులో ఒక కాయితాలపుస్తకం ఉంది. అందుమీద 'శ్రీరామ శతకం' అని రాసివుంది.

"చలమరాజు పద్యాలుకూడా వ్రాసేవాడటండీ" అన్నారెవరో ఆశ్చర్యంగా.



# అదృష్టం కరిగిన కల



"ఒకశేమిటి అన్నింటిలో ఉన్నాడు. తప్పుడు శాస్త్రాల్లో తవఖా దస్తావేజుల్లో, కోర్టులంట కాకిలా తిరిగేవాడు. ఇందులో వుండి అందులో లేదనేం లేదు. ఆఖరికి పాడు కవిత్వంలోకి కూడా దూరాడంటే నమ్మండి! ఛీ కుక్కా అని తరిమేసిందాకా అన్నిట్లో ఉన్నాడు"—

ఒక్కక్షణం నిశ్శబ్దం.

"ఐతే ఏం సంపాదించకుండా ఉన్నాడంటారా? బతికి బాగున్నప్పుడు బాగా గడించాడంటారే?" అన్నారెవరో?... ఆయనే చలమరాజు చనే కొత్త కంట తడి పెట్టింది. అదీ పూర్వ స్నేహంవల్ల. అప్పుడప్పుడిద్దరూ చదరంగం ముందు కూచునే వారు.

"అలాంటి దేమైనా ఉంటే మీకే బాగా తెలియాలి" అని మళ్ళీ ఆయనమీదకే విసిరారు.

ఆ పుస్తకం, పెట్టె ఓ గదిలో పారేసి, అంతా వెళ్ళిళవాన్ని బూడిదచేశారు. ఐతే అతని పేర పరలోకానికి దినం నడిపేవాళ్ళెవరూ లేకపొయ్యారు. ఆ చదరంగం పరిచయస్థుడే చలమరాజు పేర సోలెడు బియ్యం దానంచేసి, పరలోకంలో ఉన్నవాడికి ఉత్తరగతే ఉత్తిత్తిండీ పెట్టాడు.

నాల్గైదు రోజులైందో లేదో ఆ వీధిని వెళుతోన్న వారందరికీ భయం పట్టుకొంది. గుండెలు పీచుపీచుమంటున్నాయి. ఆ యింట్లోంచి 'భేయ్' మని రోతకూతలు, హోరుమని శబ్దాలు వినిపించసాగాయి. దాంతో చలమరాజు దెయ్యమై కూచున్నాడని నలుగురూ పుకారు పుట్టించారు. ఆ వీధిని పశువు గాని మనిషి గాని వెళుతోంటే దెయ్యం పట్టినట్టే చూసేవారు. రోజులు గడుస్తోన్నా భయం భయంలాగే ఉండిపోయింది. ఇల్లు మాత్రం కుళ్ళిపోతోంది. 'చలమరాజు దెయ్యమై కూచున్నాడు. ఇంకా ఎవర్నీ బాధించటంలా. అలా ఐందా పెలక పట్టుకు లాక్కొచ్చి సీసాలో బిగించి, పాతాళంలోకి పాతేయిస్తాం' అన్నారు కొంతమంది పెద్దమనుషులు.

అలాంటి అనుమానాల్తో కొట్టుమిట్టాడుతోన్న సమయంలో ఎవరో 'చలమరాజు దగ్గిర బంధువులం కావలసినవాళ్లం' అంటూ వచ్చారు. అందులో ఒకాయన పెద్దవాడు, ఆయన తాలూకు ఒక ఆడపిల్ల—ఇద్దరూ చలమరాజు పరలోకవాసం వినడంతోనే కన్నీరు కురిపించారు. బిగ్గరగా దుఃఖ తరంగాలు పొంగించుకొంటూ, 'ఆస్తి ముట్టజెప్పి పోతా నన్నావ్ చలమయ్యతాతా' అని అసలు రహస్యం బయటపెట్టారు. వీళ్ళిలా ఘోరంగా ఏడవడం చుట్టుపక్కలవాళ్లని కుదిమట్టంగా కదిలించింది. ఈ ఏడుపు తాలూకు బహుమానమేదో వీళ్ళకి ముట్టాల్సి వుందని అంతా అనుమానించసాగారు. ఐనా ఆ చేతికర్ర-శతకం ఆ పూరిగుడిసె తప్పించి వేరే 'లప్ప' ఏవుంది గనక? ఇంటికి చలమరాజు భూతమై కాపలా కాస్తునే వున్నాడాయిరి!.....ఎవరేనా వెళ్లారా మీదపడి ముక్కలు ముక్కలుగా పీక్కుతింటాడు.

* * *

చదరంగపాయ నింట్లోనే వాళ్లకి నాలుగు రోజులుపాటు గుక్కెడు గంజి దొరికింది. చిట్టచివరికి ఆ భూత కుటీరంలో పేరాజనే మొగాయనా, పాన్నాక్షి అనే ఆవిడా ఇద్దరూ అడుగుపెట్టారు. ఆయింటికి మటికొట్టి-అలికి-విప్పలవిడిగా తిరుగుతోన్న గబ్బిలాల్ని పారదోలి అంతా బాగుచేసుకొనేసరికి ఆ చలమయ్య దిగొచ్చాడు. వాళ్ళు ఇంట్లో అడుగు పెడుతోంటే అంతా భయంగా ఆశ్చర్యంగా చూశారు. నాటినుంచీ ఆ యింట్లోంచి కూతలూ హాహాకారాలు వినిపించడంలేదు. ఐతే పక్కనేఉన్న రావిచెట్టుమీద ఆకులు గాలి లేకుండానే గలగలలాడుతున్నాయని, నీడలు జాడలుగా కనిపిస్తున్నాయని గోల చేశారు. ఆ వీధిలో రాత్రి పన్నెండు గంటలవేళ వెళ్లేమనిషి చచ్చిపోయేవాడిలోనే లెక్క. కాని, పాకలో ఉంటున్నవాళ్లని ఏం చెయ్యదట దెయ్యం!

పేరాజు చలమయ్య చెప్పిన విద్యే చేత్తో పట్టుకొని, రాగిచెంబు తళతళతోమి, ముష్టికి బయల్దేరాడు. చెయ్యి చాపి, "చేతిలో ఓ డబ్బుంచుతారా?" అని అందర్నీ అడ్డగించేవాడు. 'దున్నపోతులా వున్నావ్! నీకు ముష్టెందుకేం?' అని చేతులు విదిల్చేవారు.

గుడిసెలో ప్రవేశించి పదిరోజులైందో లేదో, పన్ను కట్టమంటూ బిల్లుకలక్టరు నోటీసు తెచ్చాడు.

"ఇవ్వాళే ఆఖరురోజు పన్ను కట్టకపోతే, తలుపులూ ద్వారబంధాలు - ఊడలాక్కుపోతాం" అని బెదరించారు. రోజూ తెస్తోన్న బియ్యం తాలూకు అమ్మకంలో రెండు అరణాలు తెచ్చి రశీదు పుచ్చుకొన్నాడు. తనపాలిటి యములాళ్ళల్లావచ్చి దోపిడ చేసుకుపొయ్యారు.

పాన్నాక్షి గదిలోంచి బయటికొచ్చి, "ఇవ్వక తప్పుతుందా యేం? వారం రోజులపాటు ఆలస్యమైతే యేం? ఈ చింకిరిగుడ్డతో నేవుంటాను సగం కప్పుకొని..." అంది గద్గదికంగా.

గుమ్మంలోంచి 'పేరాజుగారూ;' అని కేక వినిపించింది. ఎవరో అనుకొని వెళ్ళి చూశారు.

"మీకోసమే! శవం మోస్తావా?" అన్నాడు పేరాజుకేసి ఎగాదిగా చూసి. "పక్కవీధిలో పుల్లయ్య లేడూ! వాడు కాస్తా గుటుక్కుమన్నాడు. మొయ్యడానికెవరూ రాటంలా. ఐదురూపాయిలు కూలిచ్చి మోయిస్తున్నారు" - అన్నాడు.

పేరాజు నోరు మెదపకుండా వెళ్లాడు. వెలివేశారు పుల్లయ్యకులంవాళ్లు రావంటే ... దారిన పొయ్యేవాళ్ళకి డబ్బిచ్చి మోయించేస్తున్నారు డబున్నవాళ్లు గనక. బతికినంతకాలం ఎప్పుడు ముష్టికెళ్ళినా, 'ఛీ కుక్కా!' అని తరిమేసేవాడు. పేరాజు తిట్టుకుంటూ వెళుతూంటే పాన్నాక్షి గుమ్మందాకా వచ్చి, ఒక నిట్టూర్పు విడిచింది. చివరికి శవాల్ని మోసే గతి పట్టింది! దానికి డబ్బుతీసుకోవడం కూడా పాపమే! ఒక్కక్షణం అలాగే నిలబడి చూస్తోంది. రావిచెట్టు ఆవులిస్తోంది. చెట్టుమీద తలకిందులు పక్షులు అరుస్తున్నాయి పక్కవీధిలోంచి శవం వెడుతోంది. నడిమధ్యాహ్నం ఎండ మండిపోతోంది. రావిచెట్టుకింద విశ్రమిస్తే ఎంత నిక్షేపంగా వుంటుంది!

శవాన్ని చూచిన దోషం పోయేందుకు పాన్నాక్షి స్నానం చేయబోయింది. స్నానం చేసేందుకుకూడా మరుగులేదు ఆ

గుడిసెలో. రాత్రివేళే ఇన్ని నీళ్లు కాచుకొని వళ్లు తుడుచుకొనేది.

అరవేసిన పేలికలు కట్టుకొని, తలజారుముడి వేసుకుని, చలమరాజు స్వహస్తాలతో వ్రాసిన శతకం తీసింది. ఇంతవరకూ దాని బూజుకూడా దులపలేదు. చెంపమీంచి, నీటిబిందువుల తడి కాపిడికి చుక్కలు రాలుస్తోంది. నీళ్ళతో తడిసిన చెక్కిళ్లు మెరుస్తున్నాయి. శతకం ముందు పెట్టుకొని, మెల్లిగా లోపల్లో పలే చదువుకోబోయింది. కాగితాలు చెదపట్టేసి, అక్షరాలు పురుగుల్లా అవుపించసాగాయి. అందులో ఏవో పద్దెలు అక్కడక్కడ రామశబ్దాలూ తప్పించి మరో పురుషార్థమేం లేదు. — మెత్తగా గొంతెత్తింది.

నోటి నిండంగ భ(భు)జియింప నోప
నయ్య
చేయి నొవ్వంగ బూజ నే జేయలేను
నీ పురాణమ్ము లాలింప నేర నేను
ప్రవిమలానందమూర్తి శ్రీ రామ
చంద్ర!

తియ్యగా గొంతు సాగింది. పద్యకట్టు బాగానే వుంది. పద్యాలు తిప్పలూ తిపకల్లో అలాగే వున్నై. ఒక పద్యందగ్గరికొచ్చి ఆగిపోయింది.

కట్టుకొనిపోను వరకొన కొట్టబడుదు
అర్థ దారిద్ర్యపీశికి తౌనర్థకముల
దాటగోరితి నిక్షేప ధనము దాచి
భావి నేమూల నుంతునో?...

పాన్నాక్షి గుండె గొంతులో కొట్లాడింది. కావల్సిన రహస్యం బయటపడ్డట్టు గంతేసింది. వెర్రి సంతోషంతో మొహం లావెక్కిపోయింది. అర్థంలేని ఆ కళ్ళల్లో వింతకాంతి మెరుస్తోంది. శ్మశానందగ్గరికి పరుగెత్తి, పేర్రాజుతో ఈ రహస్యం ఊగేద్దామన్నంత ఆవేశం రేగింది. 'భావి' అంటే నూతిలో అని అర్థం తీసుకొని ఇంతగల్లంతు పడుతోంది. ఎలాగైతే నేం? రహస్యం బీగాలు పగలగొట్టింది. ఎక్కడో దాచావున్న ముక్క బుజావుకొస్తోంది.

పేర్రాజుకీ వార్త చెప్పడానికి ఎంత తహతహ లాడిపోయిందో అతడు అంత ఆలస్యం చేశాడు. అతనింట్లో అడుగుపెట్టేటప్పటికి పాన్నాక్షి గూట్లో దీపం పెడుతోంది. ఆ సంతోషవార్త చెప్పడానికి తికమకపడుతూ, ఆ పుస్తకం ముందు పడేసి, "ఈ పుస్తకములో ఫలానీ పద్యం చదవండి. అందులోనే చలమయ్యతాత ఆస్తి రహస్యం దాక్కొనివుంది"— అంది.

పద్యం చదివి పెదవి విరిచేడు పేర్రాజు.

"ఏదో ఊరికే రాశాడు మనల్నేడిపించడానికి—అంతేగాని, నూతిలో డబ్బెవడు దాచాడు? ఊళ్లో ఇన్ని బ్యాంకులుండగా ఇనప్పెట్టెలుండగా" అన్నాడు.

పాన్నాక్షి ఉత్సాహం పూర్తిగా చచ్చింది సగం మనిషైంది "లేదు బావగారూ! మీరూ ఆలోచించండి!" అంది.

పద్యం చుట్టూ కళ్ళు తిప్పుతూ పదిపదిహేనుసార్లు మననం చేసుకొన్నాడు.

"పాన్నాక్షీ! చలమయ్య డబ్బు దాచింది నూతిలోగాదు గోతిలో. 'ఏ మూల దాయనూ?' అని శ్రీరామచంద్రుణ్ణి నిలదీసి అడుగుతున్నాడు. ఈ ఇలు పునాదుల్తోసహా కదిలించి పారేస్తేనేగాని, అసలు రంగు బయటపడదు."

పాన్నాక్షి కళ్లల్లో వత్తిపెట్టుకొని, "ఈ అక్షరం 'రావో', 'భావో' చూడండి!" అంది. అమార్పుమాని, పేర్రాజువొళ్లు గగుర్పొడిచింది. ఎగిరి గంతేసి పాన్నాక్షి కౌగిట్లో చిక్కాలనిపించింది.

"ఐతే రావిచెట్టే నేమో!" అన్నాడు.

"దొరికిందన్నమాటే డబ్బంతా"

"ఆ దొరికిన డబ్బుతో ఏం వ్యాపారం చేయాలి? నిన్నా మొన్నా భిక్షమెత్తి ఇవ్వాళ ఏవర్తక మేనా మొదలెడితే, ఇంకేమన్నా ఉందా?"

"ఇక్కణ్ణుంచి, ఆ డబ్బట్టుకు మకాం ఎత్తేస్తామండి!" పేర్రాజు మరేంమాట్లాడలా. పాన్నాక్షి రావిచెట్టుమూలకి తొంగితొంగి చూసింది ఏవుంది? చిక్కని చీకటి వెంపరలాడుతోంది. ఆ అంధకారంలో నిక్షేపంలాంటి నిక్షేపం దాక్కొని వుంది. కన్నుల తళతళల్తో మిరుమిట్లు గొల్పుతూ రమ్మని ఆహ్వానిస్తోంది!

అర్ధరాత్రి పారాపలుగూ తీసుకొని చెట్టు చుట్టూ త్రవ్వడం మొదలుపెట్టాడు. ధనభూతం పేర్రాజు చేత పనిచేయిస్తోంది రాత్రిగానిరాత్రి నిలబెట్టి — పాన్నాక్షి తామరకాడల్లాంటి చేతుల్తో త్రవ్విన మట్టని పైకెత్తి పారబోస్తోంది.

చుట్టూ తవ్వి చూశాడు.

ముఖంనిండా చెమటకాల్వలు కట్టింది.

ఆరోజు తిన్న అన్నం పూర్తిగా అరిగి బాగా ఆకలిమాత్రం వేస్తోంది. డబ్బుతోగాని ఆ ఆకలి చచ్చేటట్టు లేదు.

"చలమరాజు పాతాళంలోగాని దాచాడా డబ్బు" అన్నాడు పారాపలుగూ కిందపారేసి, విసిగిపోయి, చెమట తుడుచుకొంటూ...

చలమరాజు పాతాళంలో దాచాడో, కూడా పట్టుకుపోయాడో గాని, ఒక్క చిల్లుకానీకూడా లభ్యం కాలేదు. చేతులు బొబ్బలెక్కి మంటలెత్తి తెల్లవారేటంత వరకూ పని చేశారు.

పొద్దుట లేచేసరికి, వళ్ళంతా పసవులు తొక్కిన కళ్లంలా ఉంది. పేర్రాజు చేసిన పనిచూసి పొద్దుటే వచ్చి, 'ఎందుకు తవ్వావ్?' అనడిగారు. ఇలా అడిగి ఆర్చుబోయేటందుకు వాళ్ళ కధికారం ఉండనుకోలేదు. పెరట్లో చెట్టు, తన సొంతం... తన ఇష్టారాజ్యం అని ఏలుకుందామనుకొన్నాడు.

అడిగినవాళ్ళకి సమాధానం తయారుచేసి, "అబ్బే! ఇల్లు మెత్తకోడానికి" అని ఊరుకోపెట్టబోయాడు.

ఎవ్వరూ నమ్మలేదు.

వాళ్ళ అనుమానం నమ్మకంగా బలపడింది. ఈ సంగతి నలుగురి నోళ్ళల్లో పాక్కింది. పేట పేటంతా అట్టుడికి నట్టుడికింది.

పేర్రాజుకి రోజుకి రోజూ పీడకల లెక్కువైపోయాయి. వారసులూ... బంధువులూ... ఆ డబ్బుకోసం కాచుక్కూర్చున్నట్టు దావా వేసినట్టు... కత్తులు పెంచుకొని, దారి కాచి తల పగలకొట్టినట్టు... ఒకటేమిటి ఎన్ని అనర్థాలుగా కలలు రావాలో అంతకి రెట్టింపు వేగంతో వచ్చిపడుతున్నాయి

ఒక్క ముక్కలో ప్రజలు నిర్ధారణకొచ్చి, పేర్రాజుమీద తీర్మానంచేసి, "చలమరాజు దాచిన డబ్బు పేర్రాజుకి రావిచెట్టుకింద దొరికిందట"—అని ఢంకా మ్రోయించారు!

దాంతో చలమరాజు వారసులు గుడిసె చుట్టూ ప్రదక్షిణాలు చేయడం... పేర్రాజుతో వచ్చి బాతాఖానీ వేయడం... చలమరాజు చచ్చిపోయినందుకు విచారాదుల్ని ప్రకటించడం... బాంధవ్యాలు కలుపుకొని దానికి రూపురేఖలు దిద్దడానికి సర్వవిధాలా ప్రయత్నిస్తున్నారు. ఐతే పేర్రాజు వీళ్ళ పైపై వేషాలకి లొంగిపోలేదు. తగినంత జాగ్రత్తలో రావిచెట్టుకి దూరంగా వుంచాడు. ఏ అర్ధరాత్రి వేళన్నా వచ్చి ఎవరేనా తవ్వుకుపోతారేమో... అన్నంత భయంతో చెట్టు మొదల్లోనే పక్కవేశాడు.

ఎవర్నీ దగ్గరికి రానివ్వకపోవడం వాళ్లవాళ్ళ అనుమానాల్ని మరింత బలపరిచింది. రోజూ పేర్రాజు రావిచెట్టు దగ్గరికి వెళ్ళి తవ్వుతోండడం, అక్కడేపడి అహర్నిశలూ ఏడుస్తూండడం... వాళ్లని పురికొల్పింది. వారసుల్లో ముఖ్యులు ముగ్గురూ పేర్రాజుమీద కత్తిగట్టారు. ఆస్తికి దావా వేస్తామని, ఇలు స్వాధీనం చేసి వచ్చిన దోవనే పోకపోతే వారంటు పెట్టి ఖైదులో తోయిస్తామని పరోక్షంగా బెదిరించసాగారు.

ఆ బెదిరింపులకీ లొంగలేదు పేర్రాజు.



# అదృష్టం కరిగిన కల



పొన్నాక్షి గుండెలచుట్టూ భయం పొరలా చుట్టుకొంది. వాళ్లు డబ్బున్న వాళ్లు...ఏం చేసినా చేయగలరు. ఆ భయంతోనే, పేర్రాజుతో ఏదో విధంగా రాజీ పడమని మాట్లాడింది.

"గోడకేసిన బోడిపిడకలు గానారావాలి వాళ్ళకి" అన్నాడు 'దుబ్బ'న ఊసి.

పొన్నాక్షి మరేం పోరు పెట్టలేదు.

రోజులలాగే వెళ్ళమారిపోతున్నాయి. వారసులు పేర్రాజుని కోర్టు కీడ్పించారు. ఒక్క ఆరుమాసాల్లో ఇంటిమీద డిక్రీ పొంది, కుండా మండా అవతలికి పారేసి, గుడిసె వశపర్చుకొన్నారు. 'లబో దిబో' మంటూ వచ్చినదారినే పోతే ఇంత గోడ వుండకపోను. ఆడపిల్ల పొన్నాక్షితో దిక్కూ మొక్కూ లేకండా నడివీధిలో నుంచుని, కొస్త పంచకింద తలదాచుకోడానికి అబ్బు చాడు.

* * *

"ఉన్నదేదో ముందేజాగ్రత్తపడి తవ్వుకు పోయారు" అన్నాడు మొదటివారసుడు.

రెండోవాడు దానికి తాళం వేశాడు. "ఇల్లంతా గోతులు గోతులే! ఎక్కడచూచినా మన్నూ మశానం ... శ్మశానంలావుంది. ఈ పాడింటికోసం బోలెడంత డబ్బు ధారపోశాం" అన్నాడు మూడోవాడు సానుభూతి ప్రకటిస్తూ.

మళ్లీ నాటినించీ దెయ్యాలూ, భూతాలూ అన్నారు. ఇంట్లోంచి ఘోరంగా శబ్దాలు, 'కొయ్యి'మని పాడుకూతలూ వినిపిస్తున్నాయని పేటలోవాళ్లంతా గొల్లుమన్నారు.

వారసులు ముగ్గురూ ఆయిల్లు వేలం వేసి పంచేసుకుందా మనుకొన్నారు.

ఆ దెయ్యాలకొంప నెవరు కొంటారు?

ఆ పేర్రాజునే బతిమాలి మళ్ళీ తీసుకొచ్చి నెలకి 3 రూపాయ లద్దికేర్పరచి అందులోనే ఉంచారు!

పేర్రాజూ పొన్నాక్షికీ మళ్ళీ ఆఇంట్లో అంతు చిక్కలేదు.

ఒకరోజు పొన్నాక్షిపొయ్యి పడిపోయిందని, తవ్వుతోంటే ఖంగుఖంగుమని శబ్దం వినిపించింది. ఆ శబ్దం విని పేర్రాజులోపలికి పరుగెత్తుకొచ్చాడు. ఎంతసేపు తవ్వినా ఆ ఖంగు ఖంగు శబ్దం తప్ప మరేం వినిపించలేదు. ఆ చప్పుడుకి ఇరుగు పొరుగువాళ్లు ఏమిటేమిటని నిమిషాలమీద పరుగులు తీసుకొంటూ వచ్చారు.

పొన్నాక్షి పేర్రాజూ తెల్ల మొహం వేశారు.

"ఏంలేదు, ఏంలేదు" అని తప్పించుకోబోయారు.

పసిగట్టిన ప్రజలు అంతటితో పోనీయలేదు. పక్కపేటలో ఈమాట తెలిసిన వారసులు పరుగెత్తుకొచ్చి పేర్రాజుని పొన్నాక్షినీ అవతలికి నెట్టేసి ఆ పలక తవ్వడం మొదలుపెట్టారు. ఎంత త్రవ్వినా ఖంగు ఖంగుమని దగ్గుతోంది!

చుట్టూ తవ్వి పలకని పెళ్ళగించారు. ఒక వంటగిన్నిలో నిండా వెండిరూపాయిలు, కొన్ని బంగారపు కాసులతో లక్ష్మి తళ తళయమానంగా ఘలం ఘలల గజ్జెలు కట్టుకొని నృత్యం చేస్తోంది.

పేర్రాజుకీ పొన్నాక్షికీ ముచ్చెమటలు పోశాయి.

వారసులు ముగ్గురూ ఒకళ్ళ నొకళ్ళు ద్వేషించుకొన్నారు. ప్రజాసమక్షంలో పెల్లగింపబడ్డ చలమరాజు దాచిన ధనం, ఎవరి హస్తంగతమై దరిద్రాన్ని నివారిస్తుందో, ఆ క్షణంలో ఎవరూ ఊహించలేకపోయారు.

మర్నాడు పొన్నాక్షి పొయ్యిలో పిల్లిని లేపడానికి వెళ్లింది. పిల్లిని కొట్టినా ముట్టినా కదలనంటే కదలనంది.

"వారసులు ముగ్గురూ, ఒక్కొక్కళ్లూ విదేసి వేలు ఎడం చెత్తో పంచుకొన్నారట"—పేర్రాజు కంఠం నూతిలోంచి వినిపించినట్టు వినిపించింది. పొన్నాక్షి పొయ్యిపక్కనే కొయ్యబారిపోయింది.



# హనోయ్ (ఇండోచైనా)

## 1. మేమూ, మా గొడవా!

జెనీవా ఎగ్రిమెంటన్నారు; ఇండోచైనా సమస్య పరిష్కారం అన్నారు. కెనడా, పోలండు, ఇండియాలు కలిసి పని చేస్తాయి అనీ, ఇండియా మనుషులు కార్యాలయంలో పనిచేస్తారనీ అన్నారు. మనుషులని యెంచేరు, పంపించేరు. సెప్టెంబరు పంధొమ్మిదిదాకా, దినం విడిచి దినమూ, సాయంకాలం విమానాల్లో నియమితులైనవాళ్ళు – ఆఫీసర్లూ తదితరులూ – దిగడారు. విమానంలో ప్రయాణమూ, కలకత్తా (బారక్‌పూర్) లో ఆరంభించిన దగ్గర్నుంచీ హనోయ్ విమానాశ్రయం చేరుకునే వరకూ ముచ్చట్లూ, అనుభవాలూ – చిక్కుల్లో ఉన్నవాడిని మినహాయిస్తే – మిగతా వాళ్ళందరికీ బాగానే వున్నాయి; బాగా వినోదంగానూ ఉన్నాయి. మీరంతా ఆ "మిగతా వాళ్ళ"లో జమ అవుతారు గనక, యిహ వినండి:

తొలిప్లేను 9-9-54 న కలకత్తానుంచి బయలుదేరుతుందనీ, నాటికి ఒకరోజు ముందుగా అంటే 8-9-54 న కలకత్తా (బారక్‌పూర్) విమానాశ్రయ అధికార్లకి రిపోర్టవాలనీ అన్నారు. ఇంకా ఏవేవో సూచనలిచ్చేరూ, ముఖ్యంగా కలరా వగైరాలకి యింజక్షనులు పుచ్చుకోవాలనీ, భారీసామాను వేరే యింకో ట్రెయినులో పంపించాలనీ, వగైరా. ఇవన్నీ 8 వ తేదీ అపరాహ్ణం తిరిగితేనేగాని సరిపడలేదు. నాలుగో తేదీ శనివారం. అసలు ఇండోచైనాలో ఉద్యోగపు ఆర్డరు అప్పటికి యింకా సైక్లోస్టైలు అవుతోంది. అది అందుకుని చూపిస్తేనేగాని మిలటరీ ఆస్పత్రివాళ్ళు యింజక్షన్లూ అవీ యిచ్చి, అలా యిచ్చినట్టు అంతర్జాతీయ సర్టిఫికేటు (!) యివ్వం అన్నారు. ఈలోగా యింట్లో సామాన్లు సర్దుకోవాలి. యింటి ఆవిడని ఓదార్చాలి. పిల్లలకి మిఠాయి కొని పెట్టాలి (ఊరికి వెళ్ళిపోతున్నాం అనేసరికి, ప్రేమా అభిమానమూ పెల్లుబికి వొస్తాయి మరి!). తను బట్టలు కుట్టించుకోవాలి. అన్నింటికన్నా ముఖ్యం విమానంలో తీసుకెళ్ళడానికి ఓ ఫైబరు సూటుకేసో, తోలుపెట్టో కొనుక్కోవాలి. సందట్లో సడేమియ్యా, స్నేహితుల టీపార్టీలు!

టరీ హాస్పటలికి వెళ్ళేసరికి, వాడు నాలుగు సూదిపోట్లూ పొడిచి "ఇంటర్నేషనలు సర్టిఫికేటు" ఫారాలు అయిపోయినాయి అన్నాడు. ఏం దారి భగవంతుడా అని ప్రాధేయపడితే, "మీ ఆఫీసునుంచి ఫలానా ఫారం కావాలని ఓ కాగితంముక్క పుట్టించుకుని, అది హెల్తు మినిస్ట్రీవాళ్ళ చేత సిఫారసు చేయించుకుని, ఎక్కడో అయిదుమైళ్ళ దూరంలో ఎర్రకోటలో ఉన్న ఆఫీసులోకి తీసుకెళితే అక్కడ దొరుకుతాయి; అదైనా ఫారానికి అణా ఛార్జి చేస్తారు" అన్నాడు. "ఆ అణా డబ్బులికి ట్రెజరీలో చలానా కాగితం పుచ్చుకుని, తాసీల్దారు కచేరీలో స్టాంపు వేయించుకుని, రిజర్వుబేంకులో చెల్లించక్కర్లేదా?" అన్నాను, ఏడవలేక నవ్వే మొహం పెట్టి! అదలా ఉండనియ్యండి.

**కొవ్విడి లక్ష్మన్న**

పరమానందయ్య శిష్యుల్లాగ, యించుమించుగా ప్రతీవాడూ, కలకత్తాలో దిగుతూనే, ఢిల్లీలో యిచ్చిన తాఖీదు ప్రకారం 16 మైళ్ళ దూరంలోఉన్న బారక్‌పూరు ఎయిరోడ్రోముకి టాక్సీ కట్టించుకువెళ్ళేడు. కాని అంతటితో కుదుటపడిందా ప్రాణం? అక్కడి మిలటరీవాళ్ళు మా కాగితాలూ అదీ చూసి, "ఇది కేవలం మిలటరీవాళ్ళకి; మీరు సివిలియన్సు; మీ ఆఫీసరు కలకత్తా ఎస్ప్లనేడు ఆఫీసులో ఉన్నాడు అక్కడికి పొండి" అన్నారు. రానూపోనూ టాక్సీవాడికి పదహారు, పదిహేడు రూపాయిలు ముడుపు! ఈ ముక్క ఢిల్లీలోనే అఘోరిస్తే ముచ్చటతో తెమిలిపోయేది ఖేరం, టాక్సీమీద వొచ్చినాను !!

అయిపోయిందిఅనుకునేరు! మా అవకతవకలకి అంతులేదు, మరి. ఆరాత్రి పన్నెండు నలభైకల్లా నిద్రలేపి, ఆ కునుకు కళ్ళతోనే (సూటూ బూటూ వేసుకున్నా, అర్థరాత్రప్పుడు మొహం యెక్కడ కడుక్కోను?) వాళ్ళ ఆఫీసుస్టాఫ్ కార్లో బేరక్‌పూరు ఎయిరోడ్రోముకి జేర్చేరు, మమ్మల్ని. అక్కడా మిలటరీ పుట్ట. ఓ కేప్టెను వొచ్చి సామాన్లు తూచేడు. మనిషిని తూచేడు. మనిషినీ సామానూ కలిపి తూచేడు. నాలుగు పౌన్లు ఎక్కువుంది. ఆ ప్రాప్తికి సామాను

దన్నాడు ఓ మనిషి. ఇహ చూసుకోండి మాకు పట్టుకున్న గుండెదడ. నడిమధ్యస్థంగా నాలుగు గుడ్డముక్కలుతీసిఎక్కడపెట్టడం–, ఎవరికిచ్చెయ్యడమూ. పరాయిదేశం వెళుతున్నాంఏమో, అన్నీ కొత్తచొక్కాలూ, కొత్తపంట్లాంలూను! స్టేషనుకొచ్చిన కామా క్షత్తా, పోదెమ్మఇన్నీ కారుగదా, అక్కడున్నవాళ్ళు, "పోనీ వీళ్ళకియిస్తే ఆతరవాత నెమ్మదిగా బంగీకట్టి పంపుతారు" అనుకోడానికి!

భవతు. అంతమాత్రంచేతఅయితే ఏగొడవా లేకపోను. కాని అంతటితో తెల్లవారిందీ? అంతలో ఓ మిలటరీ డాక్టరు తయారుఅయి, "నీకు జ్వరంగాఉంది వెళ్ళడానికి వీల్లేదు" అన్నాడొక ఆసామీని పరీక్షించి. ఇంజక్షన్ల దెబ్బరాబాబూ అంటే వాడువింటేనా? ఇంకొకడి సర్టిఫికేటుచూసి "యిది టైపు చేసినకాయితం; అచ్చు ఫారం మీద ఉండాలి సర్టిఫికేటు" అన్నాడు. ఫారాలు అయిపోయేయి. సరూజీ ఇది అచ్చుకినక లేను అని యెన్నిచెప్పినా ఇహ వాడి మాట వాడిదే!

తీరా తెల్లవారుఝాంవ నాలుగున్నరకి ప్లేనులో పడి, తలుపు లేసుకుపోవడం కళ్ళారాచూసి, ప్రాపెల్లర్లు మోత విని "అమ్మయ్య" అనుకుంటూ సిగరెట్టు ముట్టించబోదునూ? ఎక్కడో పొంచి ఉన్నట్టు "కోపైలటు" టక్కీమనివొచ్చి పది నిముషాలదాకా సిగరెట్లు వగైరా వల్లకోదన్నాడు. వెలిగించిన అగ్గిపుల్ల ఊదేసి నోరు మూసుక్కూచున్నాం. చీకట్లో ఏం చూడనూ? కన్నూ మూతపడింది, నోటితో పాటు. ఓరాత్రప్పుడు లేపేసేరమో, నిద్దరే పట్టేసింది. ఆరింటికల్లా ఎవరో వొచ్చి లేపేరు, *Breakfast* అంటూను. సందడి కనిపెట్టి నేను బాత్‌రూమ్‌లోకి పోయేను. తిరిగివొచ్చి టీ పుచ్చుకుంటుంటే ప్రక్కనున్నాయన అడిగేడు.

"మొహం కడుక్కున్నారూ?"

"ఆహా"

"అదికాదండీ, చేతిపెట్టితోసహా అన్నీ 'ఫ్యూసిలాజ్'లో పడేసేరుగదా..." కోటు జేబులోంచి "పళ్ళపొడి" తీసి యిచ్చేను. పదిమందీకలిసి పళ్ళపొడి ఊదేసేరు. మనకి పలుకుబడి హెచ్చిపోయింది, పళ్ళపొడి ధర్మమా అనీ!

ఎనిమిదీ నలభైకల్లా రంగూన్ ఎయిరోడ్రోము చేరుకున్నాం. ఓ గంట విశ్రాంతి. ఎయిరోడ్రోం వాళ్ళూ నలుగురేసికి ఒక్కొక్క టేబిలు అమర్చి టీ, సాండ్విచ్చిలు (తలో రెండు చొప్పున) పెట్టేరు. ఒక ఆసామీ, పాపం, కూచునీకూచోవడంలో ఉన్నవన్నీ ఊడ్చేసేడు. సర్వరు నిర్ఘాంతపోయేడు ఈ మనిషి సాండ్విచ్చిలు

#  హనోయ్ (ఇండోచైనా) 

కొందరికి జ్వరం విపరీతంగా పనిచేస్తుందని అందరికీ యెలా తెలుస్తుంది, పాపం!!

ఆ సాయింకాలం 2-30 కల్లా హనోయ్ విమానాశ్రయం చేరుకుని వెంటనే గడియారాలు 2½ గంటలు ముందుకి మార్చేం. అంతలోకే కారుయెక్కి బసకి చేరుకున్నాం. కాస్సేపట్లో చీకటిపడింది. భోజనాలవేళ అయింది. కెనడావాళ్లూ, పోలండు మనుషులూ, మనం అంతా కలిసి భోజనాలు. అది బాగానే ఉంది ఉపక్రమించే వరకూ న్నూ. తీరా కూచున్నాక ఒకడిమాట ఒకడికి తెలియదని తెలిసింది. పై దేశస్తులకీ మనకే కాదు; హోటేల్లో సెర్వు చేసే వాళ్లకీ మనకీని. చేతులు సర్కస్సు చేసేయి. ఫలితం శూన్యం. అవతల టేబిల్సు మీది కెనడావాళ్ళూ పోలండువాళ్ళూ నిక్షేపం లాగ లాగి పారేస్తున్నారు. మనకి నోరు ఊరుతోంది; కడుపు కాలుతోంది; కళ్లు తేలుడు కళ్లుపడిపోతున్నాయి. "ఉప్పురా! నీయమ్మ కడుపుగాలా!" అన్నా డొకాయన.

"ఉఫ్, మున్యూర్? వీ. వీ" అంటూ వెళ్ళిపోయి, రెండు నిముషాల్లో డజను ఉడికించిన కోడిగుడ్లతో తయారయ్యాడు, సెర్వరు!

పక్కనుంచి యింకో సెర్వరు అన్నం పళ్ళెం పట్టికెళుతూ కంటపడ్డాడు. మన ఆసామీ అమాంతం వాడి జబ్బపట్టుకుని, వొస్తువ చూపించి, బలవంతాన లాక్కున్నంత పనీచేసేడు. ఇంతా చేస్తే ఒట్టి అన్నం యెలాతింటాడూ? అయితే భగవంతుడనేవాడొకడు ఉన్నాళ్లెండి. కాఫీకోసం పెట్టిన కన్‌డెన్స్డు మిల్కు (పాలడబ్బా) కంటపడింది. ఇహ నేం? అన్నం పాయసం అయి ఊరుకుంది ఆయనకి! మర్నాటినుంచీ కాఫీకి "పాలులే" వన్నంత పనీ జరిగింది! అసలు గొడవంతా మంచినీళ్లదగ్గర వొచ్చింది. ఇక్కడ యెవ్వడూ - బీదా బిక్కా కూడా - మంచినీళ్లు తాగడు. దాహంవేస్తే పచ్చి టీనీళ్లో (పాలూ, పంచదారా ఉండదు), లేకపోతే యీ దేశంలో తయారుచేసిన బీరో తాగుతారు. అడుగుతేనే గాని నీళ్లు పుట్టవ్! అడగడానికి మాట తెలియదు. వీళ్లంతా స్వభాష వియట్‌నామీజ్ గాని, సర్కారు భాష ఫ్రెంచిగాని అఘోరిస్తారు. ఆ రెండూ కూడా మనకి పూజ్యం.

## 2. ఊరూ, దాని అవస్థా

మనుషులు లేకపోతే యిల్లే బిక్కు బిక్కుమంటూ ఉంటుంది, యెంత చిన్నదైనాను. ఊరయితే బొత్తిగా నేను. అదీ హనాయ్ అవస్థ సెప్టెంబరు తొలివారంలో మేం దిగజేసరికి కొస్త చెప్పాకొదగ్గ భవంతి అన్నదల్లా—జనం పై ఊళ్లకి తరలి వెళ్ళిపోవడం మూలాన్ని—ఓ స్మృతిచిహ్నం అయి ఊరుకుంది. దానికితోడు ఊః మిలటరీవాళ్ళు! స్కూలు భవనాలూ, కాలేజీ బిల్డింగులూ, హోటేలు భవంతులూ, అదీ యిదీ యేఁవిటి, భారీ అయిన కొంపగనక అయితే తప్పకుండా ఫ్రెంచి మిలటరీవాళ్ల ఆక్రమణలో ఉన్నదన్నమాటే.

ఇహ ప్రజాసంచలనం లేదనే చెప్పాలి. పొద్దున్న 10 గంటలకి కాదు, సాయింత్రం 6 గంటలకి కాదు, ఎప్పుడు వీధులోకి వెళ్ళినా రోడ్లు "పాడూగ్గా" కనిపించేవి - ఏమూలా పిట్టమనిషి లేకపోవడం మూలాన్ని! బిక్కు బిక్కుమంటూ వీధి చివరలని మట్టుకు నలుగురు మిలటరీవాళ్లు కనిపించేవాళ్ళు, పహారా కాస్తూను. ఇహ చెప్పుకోదగ్గ మూడు పెద్ద హోటేళ్లూ మా అంతర్జాతీయ కార్యాలయంలో పనిచేసేవాళ్లకీ, మూడు దేశాల సిబ్బందికీ కేటాయింపయిపోయినాయి. రిక్వెజిషను చేసేసేరు. కాగాపోగా రోడ్డుమీద కనిపించేవాడు - మా మూడు దేశాలవాడూ కాకపోతే - రిక్షావాడూ, ఇహాను యెటుపోవడానికీ గతిలేక మిగిలిపోయిన వాడూను. ఈదేశపు తగుమనిషి అనిపించుకున్న వాణ్ణి ఎక్కడా చూళ్ళేదు, రోడ్లమీద ఆ రోజుల్లో. ఇంక ఆడవాళ్ల సంగతి చెప్పనే అక్కర్లేదు. ఒకడూ అరా ఎప్పుడైనా తప్పి దారీ కంటపడ్డా, ఏఁవిటో దేనికో భయపడిపోయిన వాళ్లలాగ చప్పు

చప్పన పక్కకి తొలిగిపోయేవాళ్లు! ఏదే శ్శయి యుద్ధానికి గురిఅయిపోయినారేమో, బాహాటంగా రోడ్డుమీదికి పొస్తే యెక్కడ యెవడు ఏం అల్లరి చేసిపోతాడేమోనన్న భయంవేను, పాపం, వాళ్లకి. అదలా ఉండ నివ్వండి.

యూనివర్సిటీవేపు వెళ్ళేం. అక్కడా యిదే తంతు. బిల్డింగులుమట్టుకు పేదవి ఉన్నాయి ఫిజిక్సు, ఫిజియాలజీ, కెమిస్ట్రీ వగైరా ఒకొక్కశాఖకీ ఒకొక్క బిల్డింగు ప్రత్యేకించిన్నీ, మేరూ పర్వతాల్లాగ. ఇవిగాక వాటికి సంబంధించిన లేబరేటరీలు. ఆ తరువాత వాటి తాలూకు "రిసేర్చి" డిపార్టుమెంట్లు. ప్రతీ భవంతికీ బిల్డింగునిబట్టి క్రమం అయిన పేద్ధ కాంపౌండూ అందులో పెద్దపెద్దచెట్లూనూ. అయితే ఎందుకూ? చచ్చినవాడికళ్లు చేరడేసి! ప్రతీబిల్డింగు గేటుదగ్గిరా ఫ్రెంచి పోల్జర్లు, తుపాకులూ పీళ్లున్నా. ఏదైనా భోగట్టా తెలుసుకుందాంఅని, మాట తెలిసినవాడు ఫ్రెంచిలో అడిగినా "వెళ్లడానికి వీల్లేద"న్న ముక్కకి మినహా మిగతాదంతా "ససేమిరా" యే!

ఇహ బజారు యెలాఉందో అని చూడ్డానికివెళితే, పనికివొచ్చేవొస్తువ వొక్కటీ కనపల్లేదు. ఇక్కడ నాణెం "పియాస్ట్రి" గవర్నమెంటు రేటుప్రకారం 1 రూపాయికి 7.35 పియాస్ట్రిలు; కాని నల్లబజారులో 1 రూపాయి 12 యింకా పధ్నాలుగు పియాస్ట్రిలకికూడా మారింది. దీనికి కీలకం మరేంలేదు. మద్రాసు మాయవరం తురకవాళ్లు కొంతమంది ఏ పదిహేను యిరవైయేళ్లక్రిందటో వచ్చి యిక్కడ వర్తకం ప్రారంభించేరు. చాలామంది బట్టల వ్యాపారస్థులు; కొద్దిమంది వాసన్నూనెలూ, పౌడర్లూ, పిల్లల ఆటవస్తువులూ అదీ యిదీ అమ్మకునే జనరల్ మర్చంట్సు. వీళ్ళల్లో ఒక్కడికీ ఒక హిందుస్థానీ ముక్కగానీ, ఉర్దూముక్కగానీ రాదు. అరవం బాహాటంగా మాట్లాడతారు. మనబోటి నల్ల మొహాలు కనిస్తే నవ్వుతూ పలకరించి మాటామంతీ ఆడతారు. వీళ్ల బంధుకోటి అంతా మెడ్రాసులోనే. ఇక్కడ వ్యాపారంలో వొచ్చిన డబ్బుపెట్టి అక్కడ భూమీ పుట్రా కొనుక్కుంటారు. అయితే ఫలానా యింతసొమ్ము (పియాస్ట్రిలలో) కన్నా పంపడానికి వీల్లేదని రూలు. అంచేత వాళ్లదగ్గరున్న పియాస్ట్రిలు మన రూపాయిల్లోకి మార్చుకుని, ఏసైగాన్లోనో పీట్నే మళ్ళీ 14 యింకా 16 పియాస్ట్రిల చొప్పున ఫిరాయించి సొమ్ము చేసుకుంటారు.

అసలు ఫ్రెంచివారిప్రాబల్యంమూలాన్నే కానివ్వండి, ఏడేళ్లయుద్ధం పరిణామంగా కానివ్వండి, పియాస్ట్రిలకి విలువలేకపోవడం మూలాన్నే కానివ్వండి ధరలు విపరీతంగా పెరిగిపోయినాయి. తువరానికి 35/- పియాస్ట్రిలు (నాలుగురూపాయిల ముప్పావలా) అంటే మిగతా ఏమీ చెప్పనఖ్ఖర్లేకుండానే ఊహించుకోవచ్చును! ఆ రోజుల్లో ఒక్క పొర్కరు సిరామాత్రం ఎంచేతనో చవకగా అమ్మేరు, 7/- పియాస్ట్రిలకి - అంటే రూపాయికిలోపు. "కాకీ" పళ్లు (సపోటా పళ్లలాంటివి; అంతకన్నా కొంచెం పెద్దవిని) ఒకొక్కటికి మూడు పియాస్ట్రిలు. అరిటిపళ్లు యిరవైపళ్లున్న పెడ 12 పియాస్ట్రిలకి కొన్నాం. ఇంక సూట్లూ అవీ అయితే వేలమీదే లెఖ్ఖ; మూడు వేలకి తక్కువ నూటేలేదు. అయితే, కొనే వాళ్లూ లేరు పాపం. చాలామంది భయపడిపోయి దక్షిణాన్న హైఫాంగులాంటి ఊళ్లకి పోయినారు. దుకాణపువాళ్ళు ముమ్ముందు ఎలాగుంటుందో అని కొంత సరుకు దక్షిణానికి సాగాను, హైఫాంగు వగైరా ఊళ్లకి తోలేసి, మిగతావాటికి ధరలు పెంచేసేరు, మాబోటిగాళ్లం (జనాభా తక్కువ లేదులెండి) కొంటాంగదా, ఎంత ధరకయినా అని. ఇంత చెప్పినా, బజార్లో కళలేదనే అనాల్సి వొస్తూంది. ఎలక్ట్రిక్ దీపాలుపెట్టి, వొస్తువలు పేర్చగానే బజారయిందా మరీ?

ఇహ కొస్త కనుచీకటి పడుతోందనేసరికి, ఆ కనిపించే నలుగురూకూడా కంటపడరు రోడ్లమీద. అక్కణ్ణుంచి ఝాంరాత్రిదాకా తాగి తందనాలాడే ఫ్రెంచి మిలటరీవాళ్ళూ, వాళ్ళని ఆధారంగా చేసుకుబతికే "అణా కానీ ముండలున్నూ" ఏవీధి మలుపునా, ఏచెట్టు కీనీడనీ చూసినా యిదే రభస!

అంగట్లో అన్నీ ఉన్నాయి అల్లుడి నోట్లో శనీ ఉన్నాదన్నట్టు—కొస్త ఊరిపొలిమేరలు దాటివెళితే అరిటిచెట్లు, పనసచెట్లు, పంపర పనాసచెట్లు, గుమ్మడి, బెండ, వంగ, చిక్కుడు మొదలయినకాయగూరలూ సమృద్ధిగా కనిపిస్తాయి. అయితే సరిగా చూసుకునే మనుషులులేకా - యుద్ధభయం మూలాన్నీ - ఎక్కడి వక్కడ వొదిలిపెట్టి పోయేరు మరి! మిలటరీవాళ్ల అల్లరి మూలాన్నీ, సరియయిన రవాణా సౌకర్యాలు లేక సమృద్ధిలో కాటకం అనుభవించింది హానోయ్. అసలు ఏ కాంపౌండులో చూసినా గన్నేరు, నూరు వరహాల చెట్లూ, నందివర్ధనం మొక్కలూ, గులాబీ, వగైరా పచ్చగా శోభాయమానంగా కనిపిస్తాయి; ప్రస్తుతావస్థలో ఊః వైరిగా పెరిగిపోయినా, బంగళాల్లో మనుషులు ఉన్నప్పుడు ఎంతో శోభాయమానంగా ఉండేదని తెలుస్తుంది!

యుద్ధం మూలాన్ని ఊరు ఎంత కళావిహీనం అయిపోయిందో చెప్పడానికి వీల్లేదు. ఊళ్లో ఎక్కడా పశువుల మందలన్నవి కనిపించవు; ఉదయాన్న కాకిగాని గద్దకాని కనిపించదు. రైలుస్టేషనూ, పోస్టాఫీసూ ఏనాడో మూసేసేరు. రోడ్లు - హానాయ్ పొలిమేరలుదాటేక - పాడయిపోయి, గోతులు పడి చెడిపోయిఉన్నాయి. జీప్‌లోవెళ్లినా అతికష్టంమీద గంటకి 10 మైళ్ళ స్పీడుకంటె ఎక్కువలేదు.

(ఇంకా ఉంది)

# "ఏలుబడి"
# పెద్ద కథ
## రచన: జి. పార్వతి

17-11-1954 వారపత్రిక మొదలు "వనితాలోకం" శీర్షికలో శ్రీమతి జి. పార్వతి రచించిన "ఏలుబడి" అను పెద్ద కథ ప్రచురించబడుతుంది. సం॥



## 1

ముహూర్తం నిర్ణయించడానికి వెళ్ళిన వరసమ్మగారు వెంటనే తిరిగి వచ్చి అక్కడి కబురు కొడుకు చెవిని వేసింది. రాజు నమ్మలేకపోతున్నాడు. తను ప్రాణంగా ప్రేమించే లక్ష్మి తనకి ఇంత మోసం తలపెట్టుతుందని ఏనాడు కూడా ఊహించి ఎరుగడు.

"ఏమి టంటున్నావమ్మా? నిజమే?"

"నిజమేరా నాకూ అదే ఆశ్చర్య మేస్తూంది"

"నేను నమ్మలేనమ్మా లక్ష్మి అలాంటి నీచపు పని ఎప్పటికీ చేయదు"

"అని నీవు అనుకుంటున్నావు" అంటూ సాగదీసింది రాజు అక్క పార్వతమ్మ.

"నేను మాత్రం ఇలా అవుతుందని అను కున్నానట్రా. ఏదో అన్న కూతురు. మనలో పిల్లని ఎంతో ఆశపడ్డాను"

"అయినా దీని కంతకు నీవే కారణమే. నిరుడు వాళ్ళు పెళ్ళిచేసుకోమంటే వీడు దాని చదువంటూ ఇంతవరకూ తెచ్చాడు. ఆడదానికినికి చదువులేకపోతే కొంప మునిగి నట్లు దానికి చదువో అని గోల"

"అయితే అదలా కాని పనులు చేస్తుం దని వీడు కలగంటాడేమిటే!" అని వర సమ్మగారందుకొంది.

"దానమ్మ కడుపుచల్లగ ఆ రాజాలు నీకు చెప్పింది కాబట్టి సరిపోయిందికాని లేక పోతే మనవాడికా కని దాపురించేది"

"ఊ మరే రాజాలు చెప్పగానే సరాసరి వెళ్లి లక్ష్మినే అడిగాను. 'నిజమే అత్తయ్యా తెలియక చేశాను'ని ఒకటేగోల"

ఈ మాటలు వింటున్న రాజు హృదయం బరువెక్కింది. ఇంక అక్కడ నిలవ్వలేక తన గదివైపుకు దారితీశాడు.

"ఏమిట్రా పిచ్చిసన్నాసీ! దాని తాత లాంటిదాన్ని తీసుకొచ్చి నీకు పెళ్ళిచేస్తా నన్న" తల్లిమాటలు వినిపించాయి రాజుకు.

రాజు గదిలోకి పోయి తలుపేసు కున్నాడు. మంచంమీద పడి ఎంతోసేపు ఏడ్చాడు. తన లక్ష్మి ఇలా చేస్తుందా! ఛీ లక్ష్మిని అనుమానించడమేమిటి, అను కొన్నాడు. మరి అమ్మచెప్పినమాట? లక్ష్మి ఒప్పుకుందని చెప్పింది.

ఎప్పుడూ లక్ష్మి ఇలాంటి పని చెయ్యదు. అనుకొంటూ పరిపరివిధాల ఆలోచనలతో వేగిపోయాడు. పోనీ లక్ష్మినే వెళ్ళి అడి గితే! అన్న ఆలోచన తట్టింది. ఇంక ఆగ లేకపోయాడు...ఎలా ఉన్నవాడలా బయ లుదేరాడు. ఎర్రగా చింతనిప్పుల్లా ఉన్న కొడుకు కళ్లు చూసింది తల్లి.

"ఎక్కడికిరా చీకటిపడి" అంది బయ టకు పోతున్న కొడుకు నుద్దేశించి.

రాజమండ్రి. మావయ్యగారింటికి" సమా ధానం చెపుతూనే గుమ్మం దాటాడు.

"సిగ్గులేదురా. ఇంకా ఎందుకు." అని పార్వతమ్మ గద్దించింది. అప్పటికే గుమ్మం దాటి చాలదూరం వెళ్ళాడు రాజు.

## 2

రాజు రైలు దిగి వెళ్ళగానే గుమ్మం లోనే రాఘవయ్యగారెదురయ్యారు. రాజును చూచి కొయ్యబారిపోయాడు, కొంచం తమాయించుకొని "రా నాయనా, గుమ్మంలోనే నిలబడ్డావేమిటి" అన్నాడు.

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

## విజయ సూర్యం

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

రాజుమాట్లాడకుండా వెళ్ళి వరండాలోని కుర్చీలో కూర్చున్నాడు. ఎదురుగా బల్ల మీద రాఘవయ్యగారు చతికిలబడ్డారు. లక్ష్మి చిన్నతమ్ముడు గోపి 'బావ వచ్చా' డంటూ రాజు ఒళ్లోకి దూకాడు. సీతమ్మ గారు గబగబవచ్చి రాజును చూచి వెంటనే లోపలకు వెళ్ళిపోయింది.

"రాజు వచ్చాడు. ఏమని సమాధానం చెప్పాలే? నా కడుపున చెడపుట్టావు!" ఈ మాటలతోపాటు ఏడ్పు వినవచ్చింది రాజుకు.

"రాజు వెంటనే లేచాడు."లక్ష్మి ఉందా మావయ్యా?" అంటూ లోపలికి దారి తీశాడు. తిన్నగా లక్ష్మి ఉన్న గదిలోకి వెళ్ళాడు.

"లక్ష్మి" అంటూ పిల్చాడు రాజు.

కిటికీలోనుండి బయటకు చూస్తున్న లక్ష్మి కళ్ళనీళ్లు తుడుచుకుంటూ వెనక్కి తిరిగింది.

"వచ్చావా బావా!" అంది ఏమనాలో తెలియక.

"లక్ష్మి! నిజమేనా?" అని సూటిగా ప్రశ్నించాడు.

"అవును బావా" అంది వెంటనే చేసిన తప్పు ఒప్పుకుంటూ.

రాజు స్తంభించిపోయాడు. ఈ సమాధానం వస్తుందనుకోలేదు. "ఏమి టంటు న్నావు లక్ష్మీ?"

"నిజమే. తెలియక చేశాను బావా. నన్ను క్షమించు" అంది గద్గదకంఠంతో.

"నిజమేనన్నమాట!" వెనక్కి తిరిగాడు రాజు. "నేను వచ్చినపని అయింది లక్ష్మి. వెళతాను. కాని నీ మీద నాకేమాత్రం కోపంలేదు. ఎప్పుడూ నువ్వు సుఖపడాలనే కోరుతూంటాను" అంటూ ముందుకు నడి చాడు.

"బావా, నన్ను క్షమించానని చెప్పి మరీ వెళ్ళు" అంది ఏడుస్తూనే. రాజువద్దనుండి సమాధానంలేదు.

"నామీద కోపం లేదన్నావు. మరి నాతో మాట్లాడకుండానే వెళ్లిపోతావా బావా?" ఎంతో దీనంగా ప్రశ్నించింది.

అవును నిజమేననుకుంటూ రాజు లక్ష్మి వేపు తిరిగి "క్షమించవలసిన తప్పేం చేశావు? నన్ను పెళ్లిచేసుకోవడం ఇష్టం లేక నీకొక్కావలసినవరుణ్ని నీవే వెదు క్కున్నావు. ఇదే తప్పా. పిచ్చిపిల్లా" అన్నాడు.

"లోకంలో చాలమందిలాగ నేను మోస పోయాను. బావా! నిజం చెప్పాలంటే నీకన్న నేనెవర్ని ఎక్కువ ప్రేమించలేను"

"ఏమిటంటున్నావు లక్ష్మి"

"నిజం చెపితే నీకు అర్థమవ్వడంలేదా బావా"

"అందుకే కాబోలు నీ కానిపనులు"

"అదే నేను చేసిన పొరపాటు. నేను మన స్ఫూర్తిగా ఈ నీచపుపనికి పూనుకోలేదు. నాకలంలో లేని కొన్ని శక్తులు ఇలాగ నన్ను ముందుకు త్రోశాయి. కాని ఈనాటి నిజ పరిస్థితి చెప్పితే ఎవరూ నమ్మలేరు బావా."

రాజుకు తలతిరిగిపోతూంది. ఏమి మాట్లాడడానికి తోచడంలేదు.

"పోనీలే బావా లోకంతోపాటు నీవూ ఆడది చేసినతప్పు క్షమించలేవు. కాని ఈ రుమాలు నా గుర్తుగా నీదగ్గరుంచుకో" అంటూ జేబురుమాలిచ్చింది. రాజు మాట్లాడ కుండా అందుకొన్నాడు. ఇంక అక్కడ

నిలబడలేకపోయాడు. గబగబ గుమ్మందాటి స్టేషనువైపు దారితీశాడు. రుమాలు విప్పి చూశాడు. 'లక్ష్మి' అని ఎంతో నేర్పుగా కుట్టిఉంది.

## 3

గుమ్మంలో అడుగు పెడుతున్న కొడుకును చూసి "ఏమిరా! అనుమానం తీరిందా?" అంది తల్లి.

రాజు సమాధానం చెప్పకుండా లోపలికి నడిచాడు. మర్నాడు ఆఫీసుకెళ్లి పదిహేను రోజులు శెలవు పెట్టాడు. ఇంట్లో కూర్చుని ఎప్పుడూ ఆలోచనే. తప్పుదారి త్రొక్కిన లక్ష్మి తన్నింకా ప్రేమిస్తున్నదా? అయితే అంత ప్రేమున్నది అలా ఎందుకు చేస్తుంది? అంతుదొరకటంలేదీ ప్రశ్నలకు. "లక్ష్మి అమాయకురాలు. దీనికంతకూ స్నేహితుల ప్రోత్సాహమే కారణం. క్షమించగలిగితే లక్ష్మిని పెళ్ళిచేసుకొని సుఖపెట్టరా" అని తన స్నేహితుడు రామారావు రాజమండ్రినుండి ఉత్తరం వ్రాశాడు. వాడిది సంస్కారహృదయం కాబోలు ననుకున్నాడు రాజు.

రోజులు దొర్లిపోతున్నాయి. రాజు మామూలు మనిషిలా తిరుగుతున్నాడేకాని లోపల ఎంత కుమిలిపోతున్నాడో ఎవరికీ అక్కరలేకపోయింది.

ఆరోజు ఆదివారం. భోజనంచేసి వరండాలో మడతకుర్చీలో పడుకున్నాడు. పేపరు చదువుతున్నాడన్న మాటేకాని దృష్టి అక్కడలేదు. పేపరు మడిచి ప్రక్కన పెట్టి అలా పైకి చూస్తూ ఉండిపోయాడు. పాపం లక్ష్మిని ఇంట్లోవాళ్ళు రాచి రంపాన పెడుతున్నారట. ఎంత బాధపడుతోందో. ఈ ఆలోచన తట్టేసరికి అతని మనస్సు మనస్సులోలేదు. అయినా తనేం చేయగలడు? అనుకుని సరిపెట్టుకోవా లనుకున్నాడు. కాని వెంటనే తన లక్ష్మిబాధ తనకు కాక మరెవరికి అని తోచింది.

"నీవు చేపట్టకపోతే లక్ష్మిగతేం కావాలో ఆలోచించావా, ఈ లోకంలో నీ కళ్ళముందే లక్ష్మి పడరానిపాట్లు పడుతుంది. సహించగలవా?" అని అంతరాత్మ బోధించింది. లోకం క్షమించి ఊరుకుంటుంది.

ఇంతలో పోస్టుమేన్ 'ఉత్తరమండీ' అంటూ కవరు పడేసి వెళ్లిపోయాడు. ఎక్స్‌ప్రెస్ డెలివరీ. రాజు కంగారుగా ఉత్తరం విప్పాడు. రాజమండ్రినుంచి వచ్చింది.

"బావా,

ఈ ఉత్తరం నీచే అందుకుంటావని ధైర్యంతో వ్రాస్తున్నాను. నీకు ఇంకా నామీద కోపం తగ్గలేదా బావా. భూదేవి కూడా క్షమించలేకపోతున్నది నా తప్పు. నీవుమాత్రం క్షమించగలుగావా! కాని నాపిచ్చి. ఏమిటో నీవు క్షమించావని ఒక్కసారి అంటే చాలు. నా హృదయం తేలికపడుతుంది. తప్పుచేసినవాళ్ళు పశ్చాత్తాపపడితేమాత్రం ఎంతమంది గుర్తిస్తారు బావా! నీవు క్షమిస్తావు కదూ.

'నీ లక్ష్మి.'



ఉత్తరం చదివేడు. "నిన్ను ఏనాడో క్షమించగలాను లక్ష్మి. కాని లోకానికి జడిసి పైకి చెప్పలేకపోయాను. కాని ఇప్పుడా అవస్థ అతిక్రమించ దలచాను లక్ష్మి" అంటూ వూనికతో కుర్చీలోనుండి లేచాడు.

## 4

వీధి వరండాలో పార్వతమ్మ భగవద్గీత చదువుతూంటే ఇరుగుపొరుగువాళ్లు చేరారు. తల్లి ఒంట్లో బాగాలేదని పడుకొంది. రాజు నెమ్మదిగా తల్లిదగ్గర కెళ్ళి "అమ్మా" అని పిల్చాడు.

"ఏం నాయనా?" అంటూ ఆవిడ మంచంమీద లేచి కూర్చుంది. రాజు ముఖం




## సచిత్ర వారపత్రిక

# నవలా రచనలో పోటీ

## బహుమతి రు. 250

## రచనలు చేరవలసిన ఆఖరు తేదీ
## ఫిబ్రవరి 1, 1955

తెలుగులో. నవలారచనను ప్రోత్సహించడానికిగాను ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రిక నవలా రచనలో పోటీ నెలకొల్పుతున్నది. పోటీకి వచ్చే నవలల్లో ఉత్తమ రచనకు రు 250/- బహుమతి ఇవ్వబడుతుంది.

పోటీ సందర్భంలో రచయితలు ఈ క్రింది వివరాలను గమనించ కోరుతున్నాము.

* రచన వారపత్రికలో 80 లేక 90 పేజీలకు మించకూడదు. రచన, కథ స్వతంత్రమైనవైఉండాలి

* నవల తెలుగుదేశంలో సామాన్య కుటుంబ జీవితానికి సంబంధించినదై ఉండాలి.

* రచనలు మా కార్యాలయానికి ఫిబ్రవరి 1, 1955 తేదీలోగా అందేటట్లు పంపాలి.

* ఈ పోటీకి పంపే రచనలకు రేపర్ పైనా, రచన మొదటి పుటలోనూ కూడా స్పష్టంగా "ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రిక నవలారచన పోటీకి" అని వ్రాసి పంపాలి. ఈ రచనలను, "ఎడిటర్, ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రిక, మద్రాసు 1." చిరునామాకు పంపాలి. రచనలు అందినట్లు తిరుగు జవాబు కోరేవారు రిజిష్టర్డ్ బుక్ పోస్టు (ఎక్నాలెడ్జిమెంట్ డ్యూ) లో పంపవచ్చును. లేదా రచనతోబాటు తమ స్వంత చిరునామాకల కార్డు జతపరిచి పంపాలి.

* బహుమతి పొందిన నవలను సీరియల్‌గా ప్రచురించే హక్కు ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రికకే ఉంటుంది. పోటీ ఫలితం మార్చి మూడోవారం వారపత్రికలో ప్రకటించబడుతుంది.

* పోటీకిగాని, ప్రచురణకుగాని స్వీకరించబడని రచనలను త్రిప్పి పంపడానికిగాను రచయితలు తమ రచనలతోబాటే అవసరమైన స్టాంపులు జతపరిచి పంపాలి. లేదా స్టాంపులు అంటించిన స్వంత చిరునామా వ్రాసిన పెద్ద కవరు పంపడం మంచిది.

* బహుమతిగురించిన తుది నిర్ణయాధికారం సంపాదకులకే ఉంటుంది.

## ★ లోకం దృష్టిలో!! ★

చూసేటప్పటికి కావిడ కడుపు తరుక్కుపోయింది. "అదేమిరా బాబు అలా వున్నావు? ఒంట్లో బాగా లేదా?" అంది ఆదుర్దాగా.

"అది కాదమ్మా... అమ్మా లక్ష్మిని నేను పెళ్లి చేసుకుంటానమ్మా" అన్నాడు ఎలాగో ధైర్యం చేసి.

"అదేమిట్రా. ఆ చెడినదాన్ని చేసుకుంటానంటున్నావా?" తల్లి విస్తుపోయింది.

"నీ అన్నగారి కూతురు తప్పు క్షమించలేవా అమ్మా."

"మనం సరిపెట్టుకుంటే మాత్రం, లోకం కోడై కూయదురా. వద్దురా మనకీ తలవంపు పనులు."

"అమ్మా నేను లక్ష్మిని తప్ప ఇంకెవరినీ చేసుకోలేనమ్మా. లక్ష్మిని చేసుకోవడానికి నీ అనుమతి ఇయ్యవూ" అంటూ చేతులు పట్టుకొని ప్రాధేయపడడం మొదలు పెట్టాడు.

"......అమ్మా చిన్నప్పుడే నాన్న పోయారు. అప్పటినుంచి పెంచి పెద్దవాణ్ణి చేశావు. అభివృద్ధిలోకి తీసికొచ్చావు. ఇప్పుడీ కోర్కె నెరవేర్చలేవా అమ్మా? నీ అనుమతి లేనిదే నే నీ పని చేయలేనమ్మా. ఊ అనవూ" అంటూ దీనంగా ప్రార్థించాడు.

నరసమ్మగారి ప్రాణం కొట్టుకుపోయింది. నిజమే. చిన్నప్పటినుండి పెంచింది. తండ్రి లేని లోటు కనిపించనీయలేదు. "నేను సుఖంగా ఉండాలంటే లక్ష్మిని పెళ్లి చేసుకోడాని కంగీకరించు" అంటున్నాడు. పెద్ద కూతురు రాత ఎలానూ బుగ్గిఅయింది. ఇంక ఈ కొడుకైనా తన కళ్ళముందు సుఖంగా మెలగకపోతే తాను భరించలేదు. నరసమ్మగారి కళ్లలో నీళ్లు తిరిగాయి.

"అమ్మా ఊ అనవూ" అని ప్రాధేయపడుతున్నాడు కొడుకు. ఈ పనే తన కూతురు చేసిఉంటే కడుపులో పెట్టుకోదూ. ఆలోచిస్తున్న దావిడ.

"లక్ష్మి తప్పు క్షమించలేవా అమ్మా."

"అలాగే నాయనా. నీ సుఖంకన్న నాకింకేం కావాలి" అంది నెమ్మదిగా ఆ తల్లి.

"నిజమేనా అమ్మా! లక్ష్మిని పెళ్లిచేసుకోనా అమ్మా. నేనంటే నీ కెంత ప్రేమమ్మా" అంటూ తల్లి ఒళ్లో తలదాచుకొన్నాడు.

"పిచ్చి నాయనా" అంటూ కొడుకు తల నిమిరింది తల్లి.

పెళ్లి చాలసామాన్యంగా జరిగిపోయింది. ఈ పెళ్లి పార్వతమ్మకు బొత్తిగా ఇష్టంలేదు. మొదట పెళ్ళికి రానన్నా తమ్ముడి బలవంతంమీద చివరకు బయలుదేరింది. లక్ష్మిని వెంటనే కాపురానికి తీసుకెళ్ళిపోయారు.

## 5

ఆ రోజు ఆఫీసు కెళుతూ రాజు "ఈరోజు సినిమా కెళదాం. నేను వచ్చేటప్పటికి రెడీగా ఉండాలి సుమా" అన్నాడు లక్ష్మితో.

సాయంత్రం లక్ష్మి అత్తగారిదగ్గరకెళ్ళి "అత్తయ్యా మీ అబ్బాయి సినిమాకు వెళదామన్నారు వెళ్ళమా'? అంది.

"అలాగే వెళ్ళమ్మా. ఈమాత్రం దానికే అన్నడగాలా"

లక్ష్మి గంతులేస్తూ గదిలోకి వెళ్ళింది. ఇదే తను మొదటిసారిగా భర్తతో సినిమాకు బయలుదేరడం. పెట్టెదగ్గర కెళ్లింది. ఏం చీర కట్టుకుంటే బాగుంటుందో? తనకేం తోచడంలేదు. అబ్బ ఈపాటికి ఆఫీసునుండి రాకూడదూ. తన చీర సెలక్టుచేసి పెట్టరూ! గడియారంవంక చూసింది. నాలుగుగంటలయింది. అబ్బో అయిదుగంటలకుగాని రారు. అయినా తనకీ తొందరేమిటి? అవును మరి వచ్చేటప్పటికి 'రెడీ'గా ఉండాలిగా. మళ్లీ పెట్టెలో చీరలన్నీ ఇటు అటు తిరగవేసింది. ఈ చీరంటే ఆయనకు చాల ఇష్టంఅంటూ నీలిరంగు సిల్కుచీర, గులాబిరంగు జాకెట్టు తీసింది. 'అరే! ఈరోజు వంట్లో కాఫీ కలపడం మరచిపోయానే' అనుకుంటూ వంటింట్లోకి దారితీసింది. లక్ష్మి గుమ్మందగ్గరే ఆగిపోయింది ఆడపడుచు పార్వతమ్మ మాటలు విని.

"పెళ్ళయి పట్టుమని పదిరోజు లయిందో లేదో. వీడు పెళ్ళాంతో సినిమాలకు బయలుదేరాడు! సిగ్గులేకపోతే సరి! ఎలాగైతే గొప్ప పెళ్ళాన్ని సంపాదించేవని."

"పోనీ లేవే. ఈ రోజుల్లో ఇలా ముడిపడడమే తరవాయి పెళ్లాన్ని వెంటేసుకొని తిరుగుతున్నారు. వాడికిమాత్రం పెళ్లాంతో సినిమాకు వెళ్ళాలని ఉండదేమిటి?" అంది నరసమ్మగారు.

"అయితే ఇలా అందరూ అయినదాన్ని కానిదాన్ని చేసుకొని నాకేకదా దొరికింది పెళ్ళామంటూ మెడకు కట్టుకొని తిరుగుతారా? అదిగో నరసమ్మగారి కొడుకు చెడినదాన్ని పెళ్ళిచేసుకొన్నారని గుసగుసలాడరే" అంటూ అడ్డుపుల్ల వేసింది పార్వతమ్మ.

"పోనీయవే. ఏదో తెలియక చేసింది. మనమే అల్లరిపెట్టుకుంటే ఎలా" అంది నరసమ్మగారు తలవంచుకొని కాఫీ కలుపుతూనే.

"అదిగో నేనేమన్నా అంటే చాలు. అల్లరి అని అఘోరిస్తారు. నాకేం మీ గోడవలు" అంటూ ముక్కు ఎగబీల్చుకుంటూ బయలుదేరింది.

# ★ లోకం దృష్టిలో!! ★

లక్ష్మి గిరుక్కున తిరిగి గదిలోకి వెళ్ళి మంచంమీద పడి వెక్కి వెక్కి ఏడ్వడం మొదలు పెట్టింది. ఇంతవరకు తను చేసిన తప్పును ఈ యింట్లో ఎవరూ రెట్టించలేదు.



తన ఆడపడుచు హృదయంలో ఇంకా తను చేసినతప్పు మెదులుతూనే ఉందన్నమాట. ఇందుకే కాబోలు తనతో సరిగా మాట్లాడదు. ఈయింట్లో ఈవిడముందు తనెలా మసులుకోవడం? భర్త ఎంతో ప్రేమగా చూస్తాడు. కాని ఏంలాభం? ఈ యింట్లో కూడా తన తప్పును రెట్టించేవారున్నారనే సంగతి గుర్తుకురాగానే లక్ష్మికి దుఃఖము ఆగలేదు. భవిష్యత్తుగురించి భయంకరమైన ఆలోచనలురావడంతో వణికిపోయింది. దానితో హృదయం వికలమైపోయింది. గుండె చెదిరిపోయేలా ఏడ్చింది.

ఇంతలో "లక్ష్మి" అంటూ రాజా గదిలోకి వచ్చాడు.

"అరె ఇంకా పడుకున్నావేమిటి? ఆ నీలంచీరె తీశావా. నేను అలాగే అనుకున్నానుసుమా!" అంటూ జోళ్లు విప్పుకోవడానికి కుర్చీలో కూర్చున్నాడు. లక్ష్మి కంగారుగా మంచంమీదనుండి లేచి గబగబ గదిలోనుండి బయటకు వెళ్ళబోతూంటే "మంచినీళ్లు కావాలి లక్ష్మి" అన్నాడు.

రాజా బట్టలు మార్చుకొని అద్దంముందు నిల్చుని తల దువ్వుకుంటున్నాడు. లక్ష్మి కాఫీగ్లాసు తీసుకొచ్చి టేబిలుమీద పెట్టి ఎదురుగాఉన్న కుర్చీలో పరధ్యాన్నంగా కూర్చుంది. రాజా వెనక్కి తిరిగి "అదేమిటి లక్ష్మి మంచినీళ్లంటే కాఫీ తీసుకొచ్చావు" అంటూ ఆమె ముఖంలోకి చూశాడు.

అతనిగుండె చెదిరిపోయింది. పెళ్ళి అయినప్పటినుండి లక్ష్మి మొహం అలావుండడము ఎప్పుడూ చూడలేదు. కళ్లు వాచివున్నాయి.

"లక్ష్మి కళ్ళేమిటి అలా ఉన్నాయి?" దగ్గరకొస్తూనే ప్రశ్నించాడు.

ఈ ప్రశ్నతో లక్ష్మి కళ్లలో నీళ్లు తిరిగాయి. మొహం పక్కకు త్రిప్పుకొని కుర్చీలోనుండి లేచింది. రాజా కంగారుగా "లక్ష్మి" అంటూ దగ్గరకు తీసుకొన్నాడు. లక్ష్మికి దుఃఖమాగలేదు. "మనం సినిమాకు వెళ్ళవద్దండీ" అంటూ అతని హృదయానికి హత్తుకుపోతూ వెక్కి వెక్కి ఏడ్వడం మొదలుపెట్టింది.

రాజాకిదేమీ అర్థం కాలేదు. లక్ష్మి ఎందుకేడుస్తున్నట్లు? సినిమాకు వెళ్లవద్దంటుందేమిటి? లక్ష్మి తల నిమురుతూ "ఛీ ఛీ అలా ఏడ్వవచ్చా" అంటూ కళ్ళనీళ్ళు తుడిచాడు. నెమ్మదిగా తన ప్రక్కకూర్చోపెట్టుకొని "ఎందు కేడుస్తున్నావు లక్ష్మి" అని బుజ్జగిస్తూ అడిగాడు.

లక్ష్మికేం చెప్పాలో తెలియలేదు. ఈ మాట వింటే ఆయన మనస్సుకూడా బాధపడుతుందేమో! తన మనస్సే కాక ఆయన మనస్సూ వికలమైపోతుంది. "అబ్బే ఏమీ లేదండి. ఇంటిదగరవాళ్లు జ్ఞాపక

మెచ్చారు," అంటూ కళ్లుతుడుచుకొంది.

"పిచ్చిదానా దీనికే ఏడవాలా. నాతో చెపితే నేను మీవూరు తీసుకెళ్ళనూ. మళ్ళీ ఆదివారం తీసుకెళ్లతానులే" అంటూ దగ్గరకు తీసుకొని "మరి లే. టైమ్ అయింది సినిమాకు" అన్నాడు...

"వద్దండి."

"అట్టే ఎలాగైనా ఈరోజు వెళ్ళాలి."

"నా మనస్సేమి బాగుండలేదండీ" అంది బ్రతిమాలుతూ.

"అయితే సరేలే." అని ఒప్పుకున్నాడు రాజు.

ఆ సాయంత్రం అంతా లక్ష్మి అలానే ఉంది. రాజు ఆమెను ఉత్సాహపరచాలని ఏవేవో కబుర్లు చెపుతూనే ఉన్నాడు. లక్ష్మి కళ్లముందు భవిష్యత్తునిగూర్చి ఆలో



చనలు భీకరంగా నృత్యం చేయడం మొదలు పెట్టాయి. రాత్రి నరసమ్మగారు కొడుక్కీ కోడలికి వడ్డించి దగ్గర కూర్చుంది. లక్ష్మి అన్నం సరిగ్గా తినడంలేదని గమనించింది సమంగా తినకుండానే "మజ్జిగపోయండి అత్తయ్యా" అంది. నరసమ్మగారు మజ్జిగ పోస్తూ "అదేమి తిండే లక్ష్మీ, ఈపూట అసలే తినలేదు" అంది.

"అది కాదే అమ్మా. ఈ పాపాయికి వాళ్ల ఇంటిదగ్గరివాళ్లమీద బెంగ పుట్టిందట్టే" అన్నాడు నవ్వుతూ.

"అంతా వట్టిదే అత్తయ్యా. ఆయన ఎప్పుడూ వేళాకోళమే" అంది చేయి కడుక్కోవటానికి లేస్తూ.

కోడలు అలా నీళ్లగదివేపు వెళ్ళడం చూసి నరసమ్మగారు కొడుకుతో "అది కాదురా. పిచ్చి సన్నాసి. పార్వతిమాటలు వింది కాబోలు. చిన్నపిల్ల. ఏం తెలుస్తుంది" అంటూ పార్వతన్న మాటలు కొడుకుతో చెప్పింది. ఇంతిలో లక్ష్మి వస్తుండడం గమనించి మాట్లాడకుండా ఊరుకొంది. రాజు లక్ష్మిని చూస్తూ "అందుకే కాబోలు నమ్మా. నేను ఆఫీసునుండి వచ్చేటప్పటికి కళ్లు వాచి ఉన్నాయి. చూడు ఎలా ఉందో" అన్నాడు. నరసమ్మగారు లక్ష్మి నుద్దేశించి "అదేమిటే పిచ్చిపిల్లా. అది అంటే ఏడుస్తారా. దాని స్వభావమే అంత. నీవేమి మనస్సు కష్టపెట్టుకోకమ్మా" అంది. లక్ష్మి ఈ మాటలకేమి సమాధానం చెప్పలేదు. అత్తయ్య ఎంత మంచిది, అనుకుంటూ గదిలోకివెళ్లింది, తువ్వాలు భర్తకు తెచ్చియియ్యటానికి.

నరసమ్మగారన్న చివరిమాటలు అప్పుడే పెత్తనాలు ముగించుకొని వచ్చిన పార్వతమ్మచెవుల్లో పడ్డాయి. వస్తూనే తమ్ముడ్ని, తల్లినీ ఉద్దేశించి "నే నేమన్నానని మనస్సు కష్టపెట్టుకోవడం.' చేసినపని చేశావనడంకూడా తప్పే కాబోలు" అంది వెటకారంగా.

రాజుకి వెటకారం బాణంలా గుచ్చుకుంది. దానితో కోపం ఆవేశించి "నీ కదంతా అనవసర మక్కయ్యా. తెలియక చేసిన తప్పుపట్టుకొని అస్తమానం పీడించడం భావ్యంకాదని నీకు తోచకపోయినా, ఎదుటివాళ్ళు కష్టపెట్టుకుంటారనే జ్ఞానం అయినా ఉండాలి" అన్నాడు విసురుగా.

దీనితో పార్వతమ్మ కోపంతో చర్రున లేచింది. "ఏమిటిరా అంటున్నావు. నాకు ఈనాటికి నీవు జ్ఞానం నేర్పుతున్నావా! నానోరు అయితే మాయగలవు కాని లోకం కోడైకూస్తుంది. దానికేమి చేస్తావురా" అంటూ ఎదురుప్రశ్న వేసింది.

రాజుకు వెర్రికోపం వచ్చింది. పళ్ళు మండిపోతున్నది. "లోకం నువ్వు పడి ఆడి పోసుకొండి అంతే కదూ చేయగలిగేది" అన్నాడు పళ్ళు పటపట కొరుకుతూ.

"ఆ! అంతకన్న మా వెలిగిపోవడంలేదు నీ బ్రతుకు. నీ పెళ్ళాంసంగతి, నీవూ రోజూ లోకం నోటిలోనే ఉన్నారు"

'అక్కా నీకదంతా అనవసరం' అంటూ గట్టిగా అరిచాడు రాజు. ఛీ ఇంట్లోవాళ్లు, వీధిలోవాళ్లూ అంతా వకటే, అనుకుంటూ తనగదిలోకి వెళ్ళిపోయాడు.

ఈ సంభాషణంతా తన గదిలోనుండి విని లక్ష్మి గజగజలాడిపోయింది. ఏమిటి? తను కాపురానికొచ్చిన ఈ కొద్దిరోజులలోనే అప్పుడే గొడవలా? కంపించిపోయింది.

గదిలో కొచ్చిన భర్త రౌద్రాకారము చూసింది. లక్ష్మికళ్ళు చెమ్మగిల్లాయి. రాజు అదిచూసి "అదేమిటి లక్ష్మీ! నిన్నే మన్నాను?" అంటూ దగ్గరకుతీసుకొన్నాడు. ఆమె తల నిమురుతూ "అయినా నీవు పిచ్చిపిల్లవుకాని నేనేమైనా అంటే నీకు బాధ కాని, అక్కయ్య అంటే నీకు బాధ ఎందుకు?" అన్నాడు.

"మీరు ఎంత మరిపింప చేసినా, లోకం నాకళ్లముందు నేను చేసినపాపాన్ని ఎత్తి చూపెడుతూనే ఉంటుందండీ" అంది.

"ఛీ. నీవు వట్టి అమాయకురాలవుసుమా. నేనుండగా నీకేం భయం. మనం లోకాన్ని వ్యతిరేకించినవాళ్లం. తెలుసునా" అంటూ ఆమె కళ్లనీళ్ళు తుడిచాడు.

## 6

రోజులు, వారాలు, నెలలు గడిచిపోతున్నాయి. నరసమ్మగారి రెండోకూతురు సత్యవతమ్మను పురిటికని తీసుకొచ్చారు. కూడా ఎడపిల్ల పైపిల్లవాడు వచ్చారు. కూతురిలా వచ్చిందో లేదో, నరసమ్మగారి అక్కకు ప్రాణంమీద కొచ్చింది వెంటనే బయలుదేరి రమ్మని టెలిగ్రాము వచ్చింది. నరసమ్మగారు బెజవాడ వెళ్ళారు. పార్వతమ్మకు లక్ష్మిమీద కసితీర్చుకోవడానికి ఇప్పుడు వీలుచిక్కింది. తల్లి లేదు. తమ్ముడు ఆఫీసుకు పదిగంటలకుపోయి సాయంత్రం అయిదింటికిగాని రాడు. సత్యవతమ్మ తోడయింది. వీళ్లిద్దరు కలిసి లక్ష్మిని మరీ వేధించుకుతినడం మొదలుపెట్టారు. లక్ష్మి ఏమి సమాధానం చెప్పకుండానే రోజులు దొర్లించివేస్తున్నది. రాజు తరచి తరచి అడిగినా "నాకేమి కష్టముండీ. పిల్లలు వాళ్లు ఉన్నారు. బాగా కాలక్షేపం అయిపోతున్నది" అంటూనే ఉంది. కాని రాజు అంతా గ్రహిస్తూనే ఉన్నాడు.

# ★ లోకం దృష్టిలో!! ★

ఆరోజు రాత్రి భోజనం చేసి రాజు తన గదిలో మంచంమీద పడుకొని ఆలోచించడం మొదలుపెట్టాడు. తానూహించని కొన్ని కష్టాలు లక్ష్మి కెదురవుతున్నాయనే ఆలోచన వచ్చేసరికి అతని మనస్సు ఎంతో బాధపడింది. తన అక్క లక్ష్మిని అలా మాటలతో బాధపెట్టడం ఎందుకో ఊహించలేకపోయాడు. ఇంట్లోను వీధిలోను అంతా తన గొడవే. ఎంత వినకూడదన్నా లోకం ఆడిపోసుకునే మాటలు చెవుల్లో పడుతూనే ఉన్నాయి. "ఈమాత్రానికే జడుస్తామని కాబోలు." ఛీ పాడులోకం అంటూ చీదరించుకొన్నాడు రాజు.

"అప్పుడే గదిలోకి దూరుతున్నావేమిటి? చంటిదానికి పాలుకలిపి చెంబులో పోయాలన్న జ్ఞానం లేదూ" అంటూ ఉరిమింది పార్వతమ్మ.

రాజు ఈ ఉరుముతో ఆలోచనలోనుండి బయటపడ్డాడు. కంగారుగా వెళుతున్న లక్ష్మిని చూశాడు. గడియారం చూస్తే పదిన్నర అయింది.

పావుగంట తర్వాత తిరిగివస్తున్న లక్ష్మిని దూరంనుంచి చూచాడు. చిక్కిపోయిన ఆ ముఖం, లోతుకుపోయిన కళ్లు—అతని కళ్లు చెమ్మగిల్లాయి. ఆమెను పెళ్ళిచేసుకొన్నది ఎందుకు? సుఖపెట్టాలని కదూ. వేరొకడి చేతిలో అయితే కష్టపడుతుందని భయపడ్డాడు. కాని తను చేసుకొని ఏం సుఖపెడుతున్నాడు? లక్ష్మి వస్తూనే మంచంమీద కూర్చుంది నీరసంగా. భర్త మొహంలోకి చూచింది. "అదేమిటండీ కళ్లనీళ్లు" అంది ఆదుర్దాగా.

"లక్ష్మి నిన్నేమీ సుఖపెట్టలేకపోతున్నాను. క్షమించు లక్ష్మి" అంటూ ఆమె చేతుల్ని తన చేతుల్లోకి తీసుకొన్నాడు.

"అదేమిటండీ! మీరు అలా బాధపడితే నామీద ఒట్టేసుమండీ" అంటూ అతని కళ్ళు తుడిచింది.

"నిజమే లక్ష్మి. చూడు నీవు ఎంత నీరసించిపోయావో."

"మీది అంతా చోద్యమేనండి. అయినా మనుష్యులు ఎప్పుడూ వొకలాగే ఉంటారేమిటండీ."

"ఎలాగైనా ఒకసారి డాక్టరుకు చూపించాలి నిన్ను" అన్నాడు.

"దానికేమి గానండీ, నేనంటే మీకిష్టమేనా" అని ప్రశ్నించింది.

"అదేమిటా పిచ్చి ప్రశ్న?"

"చెప్పండి సమాధానం"

"నాకు మా లక్ష్మి అంటే చాలఇష్టం."

"మరి అయితే నేను చెప్పినట్లు వింటారా"

"నీమాట ఎప్పుడు కాదన్నాను చెప్పు?"

"అయితే మీ అక్కయ్యగార్లు చెప్పిన మాట విని మళ్ళీ ఆ 'యలమర్తి' వారమ్మాయిని పెళ్ళిచేసుకోకూడదండీ. అప్పుడు మీకీ లోకులబాధ ఉండదు."

"నీకెలా తెలిసిందీసంగతి"

"వాళ్లు అనుకుంటూంటే విన్నాను"

"నువ్వు వింటే బాధపడతావని చెప్పలేదు. చూడు లక్ష్మి, వాళ్ళ పాడు ఆలోచనలు!"

"అదికాదండీ. నన్ను ఎక్కడికైనా పంపించివేయండి. మీరు మళ్ళా పెళ్ళి చేసుకోండి. నన్ను చేసుకోవడంవల్ల మీకన్నీ కష్టాలే" అంటూ మొహం ప్రక్కకు తిప్పుకుంది.

"ఛా అవేంమాటలు లక్ష్మి. ఇలా చూడు నీవు నన్ను విడిచిపెట్టి ఉండగలవా" అంటూ తనవేపు తిప్పుకొని కళ్ళల్లోకి చూశాడు.

"నిజమే మిమ్మల్ని వదిలి ఉండలేను. కాని నన్ను బ్రతకనిచ్చేటట్లు లేరండీ" అంటూ భోరుమంది మధ్యాహ్నం ఏదో జరిగి ఉంటుందని ఊహించుకోడానికి రాజుకెంతో సేపు పట్టలేదు.

"పిచ్చిపిల్లా అలా అధైర్యపడితే ఎలా. మనల్ని ఎవరూ వేరు చేయలేరు. నిన్ను విడిచి నిమిషమైనా ఉండలేను" అంటూ ఆమెను హృదయానికి హత్తుకున్నాడు.

## 7

లక్ష్మి రోజురోజుకు అధైర్యపడిపోతూ ఉంది తను చేసినది తప్పు—నిజమే. తను చేసింది మహాపాపం.—భర్త క్షమాహృదయుడే. కాని లోకం కాదు కాజాలదు. జీవితాంతము లోకం విధించే శిక్షల ననుభవించడమేనా?

నరసమ్మగారి అక్క పోవడం చేత దుఃఖిస్తూ ఆవిడ తిరిగివచ్చింది. సత్యవతమ్మ పురుడు పోసుకొని అత్తవారింటికి వెళిపోయింది ఆరోజు ఉదయం రాజు లేచేటప్పటికి లక్ష్మి ఇంకా నిద్రపోతూనే ఉంది. మొహం కడుక్కోవడానికి వెళ్ళి తిరిగి వచ్చేటప్పటికి లక్ష్మి ఇంకా పడుకొని ఉండడం చూసి లేపాడు.

"అబ్బ ఒళ్లంతా కాలిపోతూంది" అంటూ తల్లిని పిల్చాడు.

# కొత్త సీరియల్ నవల

# "అపస్వరాలు"

## రచయిత: 'శారద'

'మంచీ - చెడూ' నవలద్వారా మా పాఠకులకు పరిచితులైన శ్రీ 'శారద' గారి కొత్తనవల "అపస్వరాలు" త్వరలో ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రికలో సీరియల్‌గా ప్రచురించగలమని తెలపడానికి ఆనందిస్తున్నాము.

జేబు దొంగతనాలు, కాటన్ మార్కెట్లు, దుష్టవ్యాపారం, నిరుద్యోగం, దారిద్ర్యం, ధనలోభం, వంచన, నిరర్థక సంప్రదాయాలు, ఎలెక్షన్లు, కృత్రిమ రాజకీయాలతో నేటి మన సమాజజీవనం అడుగడుగునా అపస్వరాలు పలుకుతోంది. ఇట్టి మన సమాజాన్ని వాస్తవికంగా చిత్రించిన రచయిత కృషిని మా పాఠకులు ఆదరించగలరని నమ్ముతున్నాము.

—సంపాదకుడు

---

"ఎందుకండీ అంత గాబరా పడతారు" అంటూ లేవబోతూ ఉండగా నరసమ్మ గారు వచ్చి లక్ష్మి నుదుటిమీద చెయ్యివేసి చూచి "అబ్బా జ్వరం బాగా వచ్చిందిరా. పోయి డాక్టరుగారిని ముందు తీసుకురా" అంటూ కొడుకుతో చెప్పింది.

"వద్దండీ అత్తయ్యా. అదే తగ్గుతుంది" అంటూ లేవబోయింది. కాని నీరసంవల్ల వెంటనే లేవలేకపోయింది. మెల్లిగా లేచి మొహం కడుక్కొని కొంచం కాఫీ త్రాగింది. నరసమ్మగారు "పోయి నీవు పడుకో అమ్మా" అంటూ బలవంతపెట్టింది.

రాజు డాక్టరుదగ్గర కెళ్లి మందు తీసుకొచ్చి ఒక మోతాదు లక్ష్మిచేత త్రాగించాడు.

రాజు ఆఫీసు కెళ్ళాడు. నరసమ్మగారు లక్ష్మికి కాఫీ ఇచ్చి పడుకోమని చెప్పి తాను భోజనంచేసి ఊరిలో బంధువుల యింటికి వెళ్ళింది. లక్ష్మి అలా కళ్లుమూసుకొంది. ఇంతలో పార్వతమ్మ "మా ఆడపడుచు వచ్చిందే లక్ష్మి" అంటూ గదిలోకి వచ్చింది. లక్ష్మి లేవబోతూవుండగా ఆవిడ "వద్దులే అమ్మా, పడుకో. మునుపటి కన్నా చాల చిక్కిపోయావు అంది."

రుచించలేదు "ఆ! ఏం చిక్కింది. మా తమ్ముడు దాన్ని నెత్తిన పెట్టుకుంటాడు. అయినా ఒకొకళ్ళ అదృష్టమమ్మా. ఎంత కానిపనులు చేసినా ఒకొకళ్ళ అదృష్టమలా ఉంటుంది" అంది.

ఈ మాటతో లక్ష్మి కస్సుమండిపోయింది. పైమనిషి ఉన్నదని అయినా ఈవిడకు జ్ఞానంలేదేమిటి అనిపించింది. దీనితో అభిమానం రేకెత్తి సహనం దెబ్బతింది. దానితో "ఆయన ఎంత మంచివాడయితే ఏం. పైవాళ్ళు నన్ను..."

మాట పూర్తికాకుండానే "అయితే నీకంటికి నేను రాక్షసిలా కనపడుతున్నానటే" అంటూ గర్జించింది పార్వతమ్మ.

"ఏమో మీకే తెలియాలి" అంది లక్ష్మి.

"ఎంతెంతమాట లంటున్నావే. నేను రాక్షసినటే నీకు. నీలాంటిదాన్ని మావాడు చేసుకొన్నది కాకుండా ఇంతమాటనడానికి ఎవడిచ్చాడే నీ కధికారం. నీమూలంగా కుటుంబగౌరవము మంటగలసిపోయింది. తలెత్తుకొని తిరగలేక చచ్చిపోతున్నాము" అంటూ ఉపన్యాసం మొదలుపెట్టింది.

"అన్నీ ఇష్టమై చేసుకొని ఇప్పుడు నన్నిలా వీధికి లాగడ మెందుకు" అంది

"ఇప్పుడయితే మించిపోయిందిలేదు. అమ్మోరమ్మలా మావాడి నెత్తినెక్కి కూర్చోకపోతే ఎక్కడికైనా పోరాదూ. శని విరగడవుతుంది."

"అవును చక్కగా కొత్తమరదల్ని తెచ్చుకొని పిండిచేద్దామని మీ ఉబలాటం - మీ రనుకుంటున్నారేమో; మీ తమ్ముడి కంఠంలో ప్రాణముండగా అలాంటి పని చెయ్యరు" అంది మళ్ళీ.

"నీ శని మాకు విరగడయ్యేది ఉంటేగా. పో ముండా అని తన్నుతున్నా మారు పట్టుకొని వ్రేలాడే రకానివి నీవు. సిగ్గుంటేగా ముఖానికి?" అంటూ పార్వతమ్మ వెనక్కి తిరిగింది.

ఈమాటతో లక్ష్మి అభిమానం పూర్తిగా దెబ్బతింది. దెబ్బతిన్న లేడిలా చర్రున లేచింది కోపంతో. తానేం చేస్తున్నదీ తెలియనంత ఉద్వేగంలో ఉడికిపోతున్నది. బయట వర్షం పడుతున్నా లెక్కచేయకుండా గుమ్మం దాటింది. నాలుగడుగులు వేసిందో లేదో "వెళ్ళితే వెళ్ళు ఎవరిని బెదిరిస్తావు" అన్నమాటలు వినపడ్డాయి.

సాయంత్రం నరసమ్మగారువచ్చి విషయం తెలుసుకొని అబోలబోమంటూ



తిరుపతి దేవాలయం
చిత్రకారుడు: పాశర్ల సన్యాసరావు (విజయనగరం)

## ★ లోకం దృష్టిలో!! ★

వచ్చి విషయం విని నిలువునా నీరయిపోయ్యాడు. జ్వరంలో లక్ష్మి ఎక్కడికెళ్లినట్లు? ఇంతలో పార్వతమ్మ ఆడపడుచు రాజుదగ్గరకొచ్చి "ఎలా భరిస్తున్నావు నాయనా ఈవిడని. జ్వరంతో ఉన్న పిల్లని వర్షంలో సాగనంపేసింది" అంది.

**8**

రాజు అత్తవారింటికి వెళ్లేటప్పటికి హుమ్మంలో మావగారు డాక్టరును సాగనంపుతూ ఉన్నారు. రాజును చూడగానే ఆయన "ఇదేమిటి నాయనా పిల్లను అలా వర్షంలో ఒంటరిగా పంపివేశారు? ఇంటికొచ్చేటప్పటికి వళ్లు తెలియదు" అన్నాడు.

"నాకు తెలియదు మావయ్యా. నేను ఆఫీసుకుపోయినతర్వాత జరిగింది. వినగానే కంగారుపడి బయలుదేరి వచ్చేశాను." అన్నాడు సిగ్గుపడిపోతూ. లక్ష్మి మంచం చుట్టూ అన్నదమ్ములు చెల్లెలు ఉన్నారు. రాజునుచూచి అందరిముఖాలువికసించాయి.

"వచ్చావా బావా నీకు టెలిగ్రామ్ ఇచ్చాము" అన్నారు బావమరుదులు.

లక్ష్మి రెండో అన్నయ్య వాసు లక్ష్మి తలదగ్గర కూర్చుని "మాడమ్మా లక్ష్మి బావ వచ్చారు" అన్నాడు తల నిమురుతూ.

"లేదు అన్నయ్యా ఆయన ఎలా వస్తారు? ఆయనతో చెప్పకుండానే వచ్చేశాను" అంది బాధగా కళ్లుమూసుకునే. మూసుకున్న కళ్లలోనుండి కన్నీళ్లు తలగడమీదపడ్డాయి.

రాజు లక్ష్మిప్రక్కన కూర్చుని "మాడు లక్ష్మి నేను వచ్చాను" అంటూ మొహంలో మొహంపెట్టి అన్నాడు. లక్ష్మి కళ్లు తెరిచింది. ఎదురుగా భర్త మొహం – దుఃఖం ఆగలేదు. "నన్ను వెళ్ళిపొమ్మన్నారండీ. మీతో చెప్పకుండా వచ్చేశాను" అంటూ ఏడ్చింది.

రాజు "ఇందులో నీ తప్పేముంది లక్ష్మీ! నీకుమాత్రం అభిమానం ఉండదూ. వర్షంలోనే తరిమేసింది రాక్షసి" అంటూ లక్ష్మిని ఓదార్చాడు.

లక్ష్మి అయిదేళ్ల చెల్లెలు మందుగ్లాసు పట్టుకొనివచ్చి "అమ్మ ఇయ్యమంది మందు" అంది ముద్దుగా. రాజు మందు తీసుకొని లక్ష్మిచేత త్రాగించాడు.

"ఏమండీ మీరింకో వూరిలో ఉద్యోగం చూసుకోకూడదండీ" అంది ఆరోజు మధ్యాహ్నం రాజుతో. లక్ష్మి ఎంత విసిగిపోయి ఈ మాట అందో రాజు గ్రహించలేకపోలేదు.

"అలాగే. నువ్వు కొంచంసేపు విశ్రాంతి తీసుకో" అన్నాడు రాజు.

"ఏమండీ నాకు జ్వరం తగ్గేవరకు ఇక్కడే ఉంటారు కదండీ"

"నీకు జ్వరం తగ్గేవరకూ నేను ఎక్కడికీ వెళ్లను లక్ష్మీ."

లక్ష్మి నవ్వుకుంటూ కళ్లు మూసుకొని పడుకొంది. రాజు ప్రక్కనే కుర్చీలో పుస్తకం తిరగేస్తూ కూర్చున్నాడు.

మూడురోజులయినా జ్వరం తగ్గుమొహం పట్టలేదు. సన్నిపాత జ్వరంలోకి దిగిందని డాక్టరు చెప్పాడు. ఆ ఊరిలో ఒక పెద్దడాక్టర్ని తీసుకొచ్చి ఇద్దరూ వైద్యం చేయడం మొదలుపెట్టారు. ఇంట్లో ఎవరికీ కాళ్ళాడడంలేదు. రాజు స్వయంగా పరిచర్యలు చేస్తున్నాడు.

రాత్రి పదిగంటలయింది. లక్ష్మి మంచం మీద వళ్ళు తెలియనిస్థితిలో పడుకొని ఉంది. రాజు ప్రక్కనే మడతకుర్చీలో కూర్చుని లక్ష్మివంక చూశాడు. ఆరోజు తను ఆఫీసుకు వెళ్ళకుండా ఉంటే లక్ష్మికి

"ప్రతినెలా నీ జీతంలో నీవు ఇంటికి ఎంత తీసుకు వెళ్లావు?"

"ఒక్క దమ్మిడీ తీసుకు వెళ్లను."

"నిజం?"

"ఎందుకంటే జీతాలిచ్చే రోజున మా ఆవిడ ఆఫీసుకే వచ్చి నా చేతిలోనుంచి లాక్కుంటుంది"

ఇలా జరిగి ఉండేది కాదు. ఇలా ఊహించుకొనేసరికి రాజుకు దుఃఖం ఆగలేదు

ఇంతలో లక్ష్మి కొద్దిగా కళ్లు తెరిచింది. రాజువంక దీనంగా చూసింది. "కళ్ళేమిటండీ అలా ఉన్నాయి. నేను బ్రతకనని చెప్పారా డాక్టరు"? అని అడిగింది. "లేదు లక్ష్మీ! నేనుండగా అలా జరగదు. నిన్ను విడిచిపెట్టి నేనుండగలనా లక్ష్మీ" అంటూ దుఃఖం ఆపుకోలేక చేతుల్లో ముఖం దాచుకున్నాడు.

లక్ష్మి అంత జ్వరంలోను అతని తల నిమురుతూ "నిజమేనండి మీరు నన్ను విడిచి ఉండలేరు. నేను మిమ్మల్ని విడిచి ఉండలేను మరి ఇంకెందుకండి భయం; బ్రతికినా, చచ్చినా ఇద్దరమూను" అంటూ అతన్ని ఓదార్చింది.

"పోనీలే నీకు తగ్గినాకైనా వస్తే బాగుండును ఆ జ్వరం, ఎంత బాధపడిపోతున్నావో."

"ఛీ అవేం మాటలండీ ఇంజక్షనతో చంపేస్తున్నారండీ! ఒళ్ళంతా పోతే, ఇంక ఏమైనాసరే చేయించుకోనండి వద్దని చెప్తారు కదూ"

"అలాగేలే. నిద్రపో" అంటూ దగ్గరకు వచ్చాడు.

"మరి మీరుకూడా నిద్రపోండి. నాకేం ఫరవాలేదు" అంటూ కళ్ళుమూసుకొంది.

"ఫరవాలేదులే." అంటూ ప్రక్కనే ఉన్న కుర్చీలో పడుకుండిపోయాడు.

నరసమ్మగారు వచ్చింది. ఆమె అందరికన్న దిగాలుపడిపోయింది. అస్తమానూ కోడలి దగ్గరకెళ్లి "నిన్ను కడుపులో పెట్టుకొని చూసుకొంటానే తల్లీ" అంటూ వాపోవసాగింది.

ఆరోజు డాక్టర్ను చూసి లక్ష్మి కెవ్వుమని కేక వేసింది. "వళ్ళంతా పోతే డాక్టరుగారూ. చెప్పి ఉండండీ." అంటూ ప్రతిమాలడం మొదలు పెట్టింది. కూతురి పరిస్థితి చూచి తల్లి నోట్లో గుడ్డ కుక్కుకొని ఏడ్చింది.

"ఏమిటండీ మీరయినా చెప్పండి వద్దని" అంటూ భర్తవైపు దీనంగా చూసింది. రాజు గోడవైపు మొహం తిప్పుకొని కళ్లనీళ్లు తుడుచుకొన్నాడు.

"అబ్బా చంపేస్తున్నారండీ అందరూ" అంటూ లక్ష్మి మూలిగింది. "అయిపోయిందిలే అమ్మా" అంటూనే డాక్టరు ఇంజక్షనిచ్చాడు.

లక్ష్మికి పదోరోజున సంధి ప్రారంభమయింది. "గుమ్మందగ్గర ఎవరండీ నన్ను పిలుస్తున్నారు? వాళ్లని వెళ్లిపొమ్మనండీ. మిమ్మల్ని విడిచి నేను వెళ్లలేనండీ" అంటూ లక్ష్మి భర్త మెడను రెండు చేతులతోను కౌగలించుకొంది.

రాజు గజగజలాడిపోయాడు. "భయం లేదు లక్ష్మీ" అంటూ ఆమెని గట్టిగా అదిమి పట్టుకున్నాడు.

"ఏమండీ అత్తయ్యా. మీరూ నన్ను క్షమించారు కదూ" అంది అత్తగార్ని చూస్తూ.

"అదేమిటే అలా మాట్లాడుతున్నావు" అంది ఆవిడ కంగారుతో.

భర్తతో "ఏమండీ మీరెంత మంచివారండీ. మీరు క్షమించినా నన్ను లోకం క్షమించలేకపోయింది. ఆడది చేసిన తప్పు లోకం క్షమించదులెండి. దాని స్వభావమే అంతలెండి" అంది. మరుచటిరోజే లక్ష్మికి లోకం విధించే శిక్షలనుండి విముక్తి లభించింది. ★



పెద్దకథ

# సుగుణ

జి. సి. రామకృష్ణ

(గత సంచిక తరువాయి)

కాలప్రవాహంలో కొన్ని సంవత్సరాలు దొర్లిపోయాయి.

రెండవ ప్రపంచయుద్ధం ప్రారంభమై, ప్రజల జీవితాల్ని తారుమారు చేసింది.

అన్ని వస్తువులకీ ధర లెక్కువయి పోయాయి. దొంగమార్కెట్టు బలసై పోయింది.

నిత్యదారిద్ర్యంతో కాలం గడుపుతున్న రాఘవయ్యగారి కుటుంబం పెద్ద ఉప్పెనలాగా వచ్చిన ఆమార్పుకి తట్టుకోలేక తల్లడిల్లి పోయింది.

సుగుణ పెద్దదయేకొద్దీ, రాఘవయ్యకూ, శేషమ్మకూ దిగు లెక్కువయింది.

“ఇప్పుడు దాని పెళ్ళి కేం తొందరే? కల్యాణంవచ్చినా కక్కొచ్చినా ఆగదు. ఆకాలంవస్తే మన ప్రయత్నమే అవసరం లేదు” అంటుంది మేనత్త రంగమ్మ.

కానీ శేషమ్మకు సుగుణపెళ్ళి విషయమే ఆలోచన.

“వాడిదేముంది, మగవెధవ ఎట్లాగో బతుకుతాడు. దీన్ని ఎవరూ పెళ్ళి చేసుకోకపోతే నేనే గంగలో దూకేదమ్మా” అని విచారించేది. తల్లిమాటలు సుగుణకు బాధ కలిగించేవి.

రంగమ్మ తన మరిది భార్యకు పురుడు పోయడానికి బెజవాడ వెళ్ళిపోయింది.

రెండు సంవత్సరాలు అష్టకష్టాలతో ఎలాగో కాలం వెళ్లబుచ్చారు. పురుగులూ రాళ్లు కలిసిన రేషను బియ్యం తినలేక, ఒకపూట తిండి మానేశారు. రాత్రులు మొక్కజొన్న ఉప్పుపిండిగానీ, రొట్టెలు కానీ చేసుకొని తిని పడుకొనేవారు.

దురదృష్టంకొద్దీ సుగుణ కుంటిదై పుట్టింది కానీ, ఇతరత్రా ప్రకృతి ఆమె కేమీ అన్యాయం చేయలేదు. యౌవనంలో అడుగు పెడుతున్నకొద్దీ సుగుణ కొత్తశోభతో ప్రకాశిస్తూ ఉంది. రాఘవయ్య తనకు తెలిసినవాళ్లందరితోనూ సుగుణ పెళ్ళివిషయం హెచ్చరించాడు. తన శక్తికొద్దీ మర్యాదలు జరుపుతానని విన్నవించుకొన్నాడు. కానీ ఏమీ లాభంలేకపోయింది.

తనకోసం తల్లిదండ్రులిలా విచారపడడం చూచి సుగుణ తీవ్రంగా ఆలోచించడం ప్రారంభించింది. ఎంతసేపు ఆలోచించినా ఏదైనా ఆధారం దొరికితేగా! ఒకరోజు సాయంత్రం, రాఘవయ్య కోర్టునుంచి వచ్చి విసుగుతో కాగితాలు విసరిపారేసి, “చంద్రాన్ని మళ్ళీ అరెస్టు చేశారట” అన్నాడు.

“ఎందుకని?” అని ఆవేదనతో అడిగింది శేషమ్మ.

“కాంగ్రెసు నాయకుల్నందర్నీ అరెస్టు చేశారు. రైళ్లు పడగొట్టడం, పోలీసు స్టేషన్లు తగలబెట్టడం,... దేశమంతా అల్లకల్లోలమైపోతూ ఉంది” అన్నాడు రాఘవయ్య.

శేషమ్మ, గుండె బరువెక్కి తులసికోటవద్దకూర్చొని కళ్లనీళ్లు తుడుచుకుంటూ, “అయితే ... ఇప్పుడు వాణ్ణి ఎక్కడికి తీసుకుపోయారండీ?” అని భర్తనడిగింది.

“రాయవేలూరుకు తీసుకపోయారట”

తల్లిదండ్రులసంభాషణ సుగుణ జాగ్రత్తగావింటూ ఏమీతోచక ఊరకేకూచుంది.

మరునటిరోజు ఉదయం, సుగుణ బాల్యస్నేహితురాలైన సరోజని వచ్చింది.

"ఏమమ్మా సరోజనీ మాయింటికి దారితప్పి వచ్చినట్టుందే?" అని శేషమ్మ చిరునవ్వుతో నిష్ఠురంగా అన్నది.

"దారితప్పడం నాకెప్పుడూ అలవాటు లేదమ్మా. నేను ఎక్కడికైనా వెళ్లాలనుకుంటే జాగ్రత్తగా దారిచూస్తూ నే వస్తాను. సుగుణ వస్తుందేమోనని ఎదురుచూచి చూచి, కళ్లు కాయలుకాచి, ఈరోజు మనస్సు ఉండబట్టక నేనే మీఇంటికొచ్చాను పేదవాళ్లఇంటికి మీ రెందుకొస్తారు లేమ్మా" అంది సరోజ

"సరోజా, పేదవాళ్లెవరయిందీ నీ మనసుకు నీకు తెలీదా?" అంది సుగుణ

"సరే, ఇక ఆసంగతి పోనీగానీ, ఇవాళ సినిమాకు పోదామనుకున్నాం. వస్తావా రావా. ఒక్కమాటచెప్పు" అని ఖచ్చితంగా అడిగింది సరోజ.

సుగుణ తల్లిముఖం చూచింది. శేషమ్మ సరోజనిమాటలు వినీ విననట్లు ఊరుకుంది.

"ఏమమ్మా, సుగుణను ఇవాళ సినిమాకు పంపేస్తావా? లేదా?" అంది సరోజ

"సరేలేవే. దానిదేముంది బ్రహ్మాండం. సాయంత్రం అలాగే వెళ్లురుగాని" అంది శేషమ్మ. సాయంత్రం మళ్లీవస్తానని సరోజ యింటికెళ్ళింది.

"సుగుణా, అది చాలా పోకిరిపిల్ల. నీవు దానితోకూడా తిరుగుతూ, నీ యిష్టంవచ్చినట్టు ఆటలాడావంటే, మేము వేగలేమమ్మా. తర్వాత నీ యిష్టం" అంది శేషమ్మ.

సుగుణకు ఏమి చెయ్యాలో తోచలేదు. సాయంత్రం సరోజని వచ్చింది.

"వాళ్ళ నాన్న వద్దన్నాడమ్మా" అని శేషమ్మ మెల్లగా చెప్పింది.

సరోజనికి పట్టరాని కోపం వచ్చింది.

"కూతుర్ని ఎన్నాళ్లు జైల్లో పెడతావమ్మా? ఒకరోజు సినిమాకు పోతేనే పెద్ద తప్పా?" అని సరోజని విసురుగాం అడిగిది.

శేషమ్మ నవ్వి, "ఎందుకు సరోజా అంత కోపం? మీకేం? మీరు తిరగా లంటారు. ముల్లుమీద అరిటాకు పడినా, అరిటాకుమీద ముల్లు పడినా, అరిటాకుకే నష్టం" అంది శేషమ్మ. సరోజని యిక పలకకుండా ఒక్క విసురున వెళ్లిపోయింది. సుగుణ సందిగ్ధావస్థలో పడింది.

సరోజ చిన్నప్పటినుండి సుగుణను చాలా ప్రేమతో చూచేది. బడిపిల్లలు సుగుణను గోలచేస్తుంటే చూచి ఓర్చుకోలేక వాళ్ళతో పోట్లాడింది అటువంటి స్నేహితురాలి మాట ఎలా తోసెయ్యడం? తల్లి మాట వినకపోతే ఆమె మండిపడిపోతుంది.

ఒకనాడు సాయంత్రం సుగుణ తల్లిని ఎలాగో ఒప్పించి సరోజని యింటికి వెళ్ళింది సరోజని తల్లి కాంతమ్మ వంటయింట్లో ఏదో పనిచేసుకుంటూ ఉంది.

సుగుణ నేరుగా ఇంట్లోకి వెళ్ళింది సరోజని కిటికీదగ్గర నిల్చొని ఏదో గాఢంగా ఆలోచిస్తూఉంది. సుగుణ వెళ్ళి సరోజని వెనక నిల్చుంది; సరోజ గమనించలేదు.

సుగుణ కిటికీలోనించి చూచింది. ఎదురింటి మిద్దమీద ఒక అబ్బాయి నిల్చొని, సరోజనిని పిలుస్తున్నాడు. సరోజనికూడా చేతివేళ్ళు మాత్రమే కదిలిస్తూ, పిలుస్తూ ఉంది సుగుణ నిశ్చేష్టురాలై పోయింది. కొంతసేపటికి సరోజని వెనక్కుతిరిగి సుగుణను చూచి వెలవెలపోయింది గాభరాతో ఏమి మాట్లాడడానికి తోచక కొంతసేపు తటపటాయించి "అమ్మ దొంగా...ఎంతసేపయిందే వచ్చి?" అన్నది సుగుణ పకపకా నవ్వి "దొంగలెవరో తెలుస్తూనే ఉంది" అని జవాబిచ్చింది. సరోజని తప్పు చేసినట్లు సిగ్గుతో నవ్వి, "సుగుణా,...నీతో చెపుదామని...చాలా రోజుల్నుంచి అనుకుంటున్నాను కానీ ఏమని చెప్పను? ఇదొక సంగతిగా నీతో చెపితే నీవేమనుకుంటావో నని చెప్పలేదు - సరే కానీ సుగుణా, నేను నీ స్నేహితురాల్ని కదా? ఒక్కమాట అడుగుతాను. నిజం చెపుతావా?" అన్నది సరోజ.

"ఏమిటి?"

"నువ్వెవర్నీ ప్రేమించలేదా సుగుణా?" అంది సరోజ. సుగుణకు ఏమి చెప్పడానికీ తోచలేదు. కొంతసేపు ఆలోచించింది. "నేను ప్రేమిస్తాననుకో, వాళ్ళు నన్ను ప్రేమించాల్సిన అవసరం లేదా సరోజా?" అన్నది.

సరోజ ఎగిరి గంతువేసింది. "చిక్కింది; దొంగ చిక్కింది. నీ మనసులో ఎవరో ఉన్నారు. చెప్పు. నిజం చెప్పు" అని సుగుణను పట్టుకుని చక్కలిగింతలు పెట్టింది. సుగుణ సరోజని చేతుల్నుండి తప్పించుకొని, "ముందు నువ్వుచెప్పు. తర్వాత నేను చెప్తాను" అంది

సరోజని సిగ్గుతో కొంచెంసేపు చిరునవ్వు నవ్వి "నేను చెప్పేదేముంది? నువ్వే చూచావుగా" అంది.

"ఎవర్ని"

"ఇప్పుడు కిటికీలోంచి చూచావా లేదా?"

"ఓహో" అంది సుగుణ.

"రఘు చాలా మంచివాడు. యం. బి. బి ఎస్. చదువుతున్నాడు. వాళ్లనాన్న గుడ్డలవ్యాపారస్థుడు. రఘు రోజుకొక జాబు రాస్తాడు సుగుణా. నాకోసం ప్రాణాలైనా విడుస్తానంటాడు ఆయన రాసేజాబులు దాచిపెట్టలేక నాకు ప్రాణాలు పోతున్నాయి. మాఅమ్మా, నాన్నా ఎక్కడ చూస్తారో అని భయంతో చచ్చిపోతున్నాను. ఎలాగైనాసరే నేను రఘునే పెళ్ళి చేసుకుంటాను. పాపం నేనంటే అతని కెంత ప్రాణం అనుకున్నావు? ఆడదాని కంతకంటె ఏమికావాలి సుగుణా?" అని సరోజ అమాయకంగా సుగుణకళ్ళల్లోకి చూచింది. సుగుణకు తల గిఱ్ఱున తిరిగిపోతూ ఉంది.

"సరే. నే చెప్పాగా. ఇంక నువు చెప్పు" అని సరోజ సుగుణను గుసగుస అడిగింది.

సుగుణహృదయంలో ఏదో అర్థంకాని కల్లోలం చెలరేగింది.

సుగుణ ఎంతమందినో చూస్తూనేఉంది. కానీ తన కెవ్వరూ జాబులు రాయలేదు. పక్కింటి అబ్బాయి ప్రతిదినం చూస్తూనే ఉంటాడు. కానీ ఎప్పుడైనా ఒంటరిగా కనపడ్డా, నోరు తెరిచి ఒక్కమాటైనా మాట్లాడడు. సుగుణ చాలాసేపు ఆలోచించింది. ఆమె మనోనేత్రం ముందు ఎంతమంది యువకులో వస్తున్నారు, వెళ్లుతున్నారు. అఖరున ఒకమనిషి జ్ఞాపకానికొచ్చాడు. సుగుణ మనసులో మిగిలిన బొమ్మలన్నీ మాయమైపోయాయి. కానీ ఆమనిషిమాత్రం సుగుణ హృదయమంతా ఆక్రమించుకొన్నాడు.

"చెప్పు" అని సరోజ తొందరచేసింది.

# ఒక వారానికి ఎంత తుషార్

## మీరు వాడుతారు?



వారానికి మీరు ఎంతవాడినా, చిరకాలంనుంచి మీకుప్రియమైన ఈ వనస్పతి కొత్తగా. ఆరోగ్యప్రదంగా ప్యాక్‌చేసిన డబ్బాలలో మీకు దొరకగలదు. మీకు సౌకర్యంగా వుండగలిగినట్లు అమ్మకానికి పెట్టబడినవి. క్రిమికీటకాదులు దూరడానికి వీలులేని ఈ కొత్త డబ్బాలలో స్వచ్ఛమైన వనస్పతి తాజాగా మీకు చేరుతుంది.

10 పౌనులు?
5 పౌనులు?
2 పౌనులు?




తుంగభద్ర ఇండస్ట్రీస్ లిమిటెడ్., కర్నూలు.

తుషార్
వనస్పతి



# సుగుణ



"మాచంద్రం మామయ్య" అని సుగుణ సిగ్గుతో తలవంచుకొంది.

సరోజ ఆశ్చర్యానికి అంతులేదు.

"ఓసి పిచ్చిమొద్దా...మీ చంద్రం మామయ్యకు ఎన్నేళ్లే? పదహారేళ్లపిల్లవు, ముప్ఫై ఏళ్ళవాణ్ని పెళ్ళి చేసుకుంటావా? ఇక పరవాలేదు. అమ్మగారు అయ్యగార్ని కట్టి పట్టుకొని నడిపించొచ్చు. ఓహో అది కాదులే, మామయ్యను పెళ్ళిచేసుకుంటే, జల్సాగా మీటింగులకు పోతూ, కార్లల్లో షికార్లు కొట్టొచ్చునికదూ? నాకు తెలుసులే నీఆలోచన" అని ఎగతాళి చేసింది. సరోజని చిలిపితనానికి సుగుణ ఓర్చుకోలేకపోయింది.

"అది కాదు సరోజా, ఇంక నన్నెవ్వరూ పెళ్ళి చేసుకోకపోతే, మా చంద్రం మామయ్యకే ఇచ్చి చేస్తానని మా అమ్మ చెప్పింది" అన్నది సుగుణ.

"ఓసి పిచ్చిదానా......అయితే మీ మామయ్య ఇప్పు డెక్కడున్నాడు."

"రాయవేలూరు జైల్లో."

"ఇదుగో సుగుణా. నేను చిన్నప్పటి నుండి స్నేహితురాల్ని నా మాట విను. ఆ దేశదిమ్మరిని పెళ్ళిచేసుకొని నీవేమి సుఖపడతావు సుగుణా?"

సుగుణ కళ్లలో నీళ్లు గిఱున తిరిగాయి. సరోజ తన పమిట చెరగుతో ఆమె కన్నీరు తుడిచింది.

ఇంతలో ఎవరో ఒక ముసలాయన ఇంట్లోకి వచ్చి "ఏవమ్మ కాంతమ్మగారూ, ఎప్పుడమ్మ పప్పన్నం పెట్టేది?" అన్నాడు.

"సుగుణా అడుగో, శేషయ్య తాత వచ్చాడు" అని సరోజ ఎగిరి గంతులేస్తూ,

"తాతయ్యా, ఇలా రా, ఇలా రా. మా సుగుణ చెయ్యి చూడు" అని ఆయన్ను సుగుణదగ్గరికి తీసుకొచ్చింది.

శేషయ్యతాత సుగుణ ఎడం చెయ్యి చూసి ముసిముసి నవ్వులు ప్రారంభించాడు.

"త్వరగా చెప్పు తాతయ్యా, సుగుణకు ఎప్పుడు పెళ్లవుతుంది? ఎంతమంది పిల్లలు?" అని సరోజ గోలచెయ్యడం ప్రారంభించింది.

"అబ్బా, ఉండమ్మా. ఎందుకంత తొందర. నేను చూస్తున్నాగా" అంటూ తాతయ్య సుగుణ చేతి వేళ్లన్నీ విరిచి విరిచి చూచాడు. సుగుణ కోపంతో మండి పోయింది.

"అమ్మాయ్, నీకు ఈ సంవత్సరంలో తప్పకుండా పెళ్లవుతుంది. పిల్లలు ఆరు, మూడు...ఆరుగురు మొగపిల్లలు ముగ్గురు ఆడపిల్లలు" అని ముగించాడు. సరోజని విరగబడి నవ్వింది. సుగుణ మొహం మాడ్చుకుంటూ కూచుంది.

తాతయ్య ఇంకేమైనా వాగుతాడేమో, సుగుణకు ఇంకా కోపం ఎక్కువవుతుందేమోనని సరోజ గ్రహించి, "తాతగారూ, తమ జోస్యం చాలుగాని, ఇంక బయటికి దయచెయ్యండి" అన్నది.

తాతయ్యకు రోషం వచ్చింది. "అంతా అల్లరి వ్యవహారం. చూడవమ్మా, కాంతమ్మా" అని బిగ్గరగా అరిచాడు.

కాంతమ్మ వంటయింట్లోనుంచి గబగబా వచ్చి, "ఒసే, సరోజా, ఏమిటే ఆముసలాయన్ను ఏడిపిస్తున్నావూ?" అని మంచి మాటలు చెప్పి తాతయ్యను పంపివేసింది.

తరవాత కోపం తగ్గించుకొని, "ఏవమ్మ సుగుణా, ఇంకా మీవాళ్లు నీ పెళ్లి సంగతి అనుకోలేదా?" అని అడిగింది.

"మీ సరోజనికి మాఘమాసంలో పెళ్ళి చేస్తారని, ఎవరో అన్నారే!" అంది సుగుణ.

"ఒసే నంగనాచీ; నీ సంగతి నే నడుగుతుంటే, సరోజని పెళ్ళి మాఘమాసంలో అంటా వేమిటే? దాన్ని ఎవరు చేసుకుంటారు? ఈ గయ్యాళిపిల్ల ఎవరి పాలబడుతుందో గాని, దీన్ని కట్టుకున్నవాడు, బైరాగుల్లో కలిసిపోవాలసిందే" అంది కాంతమ్మ చిరునవ్వుతో.

సరోజ విరగబడి నవ్వి, సుగుణకు చక్కిలిగింతలు పెట్టి నవ్వించింది.

"వస్తానమ్మ. పొద్దు పోయింది" అని సుగుణ ఇంటికి బయలుదేరింది. "సరేనమ్మ" అని సరోజ సుగుణను వెక్కిరించి కిలకిల నవ్వింది. సుగుణ కుంటికాలుతో ఊగుతూ నడుస్తూంటే, సరోజని అవైపే చూస్తూ నిలుచుంది. సముద్రుని అలలధాటికి తట్టుకోలేక, భారంతో అటూ ఇటూ ఊగే నావలాగా, యౌవనభారాన్ని మోయలేక మోస్తూ, కుంటి సుగుణ ఇంటికి వెళ్లింది.

## 5

యుద్ధం ముగిసింది.

దేశమంతటా సమ్మెలు పోరాటాలూ చెలరేగాయి. వెల్లువలా పొంగి వ్యాపిస్తున్న ప్రజోద్యమాన్ని అరికట్టడానికి బ్రిటిషు ప్రభుత్వానికి చేతకాలేదు.

"మీకు స్వాతంత్ర్యం ఇచ్చేస్తున్నాం" అని ప్రకటించి రాజకీయ ఖైదీల నందర్నీ విడుదలచేయడం ప్రారంభించారు. ప్రజల్లో ఏదో నవచైతన్యం కనిపించసాగింది.

చంద్రశేఖరం విడుదలై వచ్చాడని తెలియగానే రాఘవయ్య శేషమ్మ సుగుణా, చాలా సంతోషించారు.

వస్తాడు, వస్తాడు అని ఎంతో ఆసక్తితో అందరూ ఎదురుచూచారు.

ఒకరోజు ఉదయం రానేవచ్చాడు. శేషమ్మ తమ్ముణ్ణిచూచి ఆశ్చర్యపోయింది.

పూర్తిగా మారిపోయాడు చంద్రం. రాఘవయ్యగారికి నోటివెంట మాటే రాలేదు.

చంద్రం పకపకా నవ్వి "ఏంబావా, ఎందుకలా చూస్తారు. ఏమిటి మీరు? అప్పుడే ఇంత ముసలాళ్లయిపోయారే!" అని చిరునవ్వు నవ్వుతూ, సుధాకరుణ్ణి దగ్గరికి తీసుకొన్నాడు. వాడి బుగ్గలు నిమురుతూ "అమ్మో, మీరందరూ ఎంతమారిపోయారు?" అని సుధాకరుణ్ణి రెండుచేతులతో తీసుకొని తొడపై కూర్చోబెట్టుకొని సంసార జీవితానికి వాచిపోయినమనిషిలా ఏదో ఆవేదన పడ్డాడు.

శేషమ్మ తమ్ముణ్ణి అట్టే కొంతసేపు చూచి, ఇంట్లోకివెళ్ళి చెరగుతో కన్నీళ్లు అద్దుకొంది. "అబ్బే, సుగుణకి ఈడు కాదు" అని మనసులోనే అనుకొంది. సుగుణ తలుపు చాటునచేరి మామయ్యను తనివిదీరా చూచింది. "అమ్మో. నిజంగా మామయ్య చాలా పెద్దవాడులాగా కనపడుతున్నాడే! పాపం జైల్లో బాధలు పడిపడి యిలా అయిపోయి ఉంటాడు" అనుకొంది. ఇంతలో రాఘవయ్య "సుగుణా, కొంచెం కాఫీ పెట్టి తీసుకరామ్మ, మీ మామయ్యకు" అన్నాడు.

చంద్రం నవ్వి "ఏదీ సుగుణ ఇంట్లోనుంచి బయటికే రాలేదే" అన్నాడు.

సుగుణకు గుండె దడదడ కొట్టుకుంది. రివ్వున వంటయింట్లోకి పరుగెత్తింది.

"చూచావా మీ మామయ్యను" అని అడిగింది అమ్మ. సుగుణ చిరునవ్వు నవ్వి మౌనంగా కూచుంది.

"నేను ఖచ్చితంగా చెపితే, వాడు కాదనడు. కానీ, చాలా పెద్దవాడులాగా కన్పిస్తున్నాడు. ఏం సుగుణా! నీకిష్టమేనా?" అని అమ్మ అడిగింది. సుగుణ జవాబు చెప్పకుండా, చిరునవ్వు నవ్వుతూ, కాలిగోళ్లు గిల్లుకుంటూ కూచుంది.

రెండులోటాల్లో కాఫీపోసి, "ఇచ్చిరాపో" అని అమ్మ ఆజ్ఞాపించింది.

సుగుణ నవ్వుతూ అమ్మకళ్ళల్లోకిచూచి, "నువ్వే ఇచ్చిరామ్మ" అని వేడుకుంటున్నట్లు చెప్పింది.

"పరవాలేదుపోవే, ఎందుకంత సిగ్గు? వాడేమి పరాయివాడా?" అని తల్లి బలవంతం చేసింది.



# సుగుణ



ఇక విధిలేక రెండు లోటాలు కాఫీ తీసుకొని, అడుగులో అడుగు వేసుకుంటూ, నాన్నకు ఒకలోటా అందివ్వబోయింది.

"ముందు మీ మామయ్య కియ్యవమ్మా" అంటూ రాఘవయ్య, ఒకలోటా అందుకున్నాడు.

చంద్రం మెల్లగా కనురెప్పలు పైకెత్తి, ఆశ్చర్యంతో ఆవేదనతో సుగుణను చూస్తూ, కాఫీ అందుకున్నాడు.

సుగుణ ఇంక క్షణంకూడా అక్కడ నిలవకుండా ఇంట్లోకి పరుగెత్తింది. తన ముల్లెంతా మునిగినట్లు గుండె ఎందుకో దడ దడ కొట్టుకుంటూంది.

సుగుణ ఎంత గాభరాపడిందో, చంద్రం అంతకంటె ఎక్కువే గాభరాపడ్డాడు. స్త్రీ స్పర్శ ఎరుగని మగవాడు, ఒక అందమయిన యువతి తనను గౌరవిస్తుంటే ఎంత త్రొటుపడతాడో, అటువంటి అనుభూతి నే చంద్రం ఆ క్షణంలో అనుభవించాడు.

కాఫీ చప్పరించి, రాఘవయ్య, "నిజంగా, మనుషులంటే మీరేనోయ్" అన్నాడు.

చంద్రం, నవ్వి "ఏం, బావా? ఎందుకలా అంటున్నావ్" అన్నాడు.

"ఎట్లాఅయితే ఏం? స్వరాజ్యం సాధించారుగా! నిజంగా ధీరులలక్షణమే అది. ఎన్నికష్టాలొచ్చినా, అనుకొన్న పని సాధిస్తారు" అన్నాడు బావ.

"ఏం సాధించడం బావా!...ఇప్పటికి ఏమైనట్లు? అధికారం మనవాళ్ల చేతికి వచ్చినంత మాత్రాన, మనకు ఒరిగేదేముంది?" అని చంద్రం కాఫీ గుక్కెడు చప్పరించాడు.

"అదీ నిజమే." అన్నాడు రాఘవయ్య.

"అధికారం ఒకరిచేతుల్లోంచి, ఇంకొకరి చేతుల్లోకి మారినంత మాత్రాన ఏమీ లాభం లేదు." అని చంద్రం కాఫీతాగడం పూర్తి చేసి, కిటికీవైపు చూచాడు. ఆ కిటికీలోంచి రెండు కళ్లు తనను చూస్తూనే ఉన్నాయని ఆయనకు బాగా తెలుసు. సుగుణ కూడా మామను తనివితీరా చూచింది. మామ చూచిన చూపులో ఏమి అర్థం ఉందో కానీ, "సుగుణా నేను నీ కిష్టమేనా?" అన్న మాటలు చంద్రం చూచిన చూపులో సుగుణకు స్ఫురించాయి.

"వస్తా బావా; వర్కింగ్ కమిటీ సమావేశానికి బెజవాడ పోవాలి" అన్నాడు చంద్రం.

"ఏమిటి చంద్రం! ఇంకా ఏమి సమావేశాలురా? పోదుగానిలే. భోంచేసి పోగూడదూ?"

"కాదు బావా. నిన్ననే పోవాల్సింది. మిమ్మల్ని చూచి చాలా రోజులయింది. ఇంక ఎప్పటికి చూస్తానో అని వచ్చాను."

మామయ్య వెళ్లిపోతున్నాడని సుగుణ అప్పుడే అమ్మకు చెప్పేసింది.

శేషమ్మ పరుగెత్తుకుంటూ వచ్చి, "ఏమిట్రా, మరీ విచిత్రంగా ఉందీ! మరేం మునిగిపోయిందేమీ లేదులే, భోంచేసి పోవచ్చు" అని ఖచ్చితంగా చెప్పింది.

"కాదమ్మా. తప్పకుండా వెళ్ళాలి. వస్తాగా మళ్ళీ" అని చంద్రం అక్కగారి మాటలు వినిపించుకోకుండా వెళ్ళిపోయాడు.

## 6

కొన్ని సంవత్సరాలు చంద్రం మళ్ళీ రాఘవయ్యగారి ఇంటి కడప తొక్కనే లేదు.

ఇంటి యజమాని ఒకనాడు రాఘవయ్యను పిలిచి, "ఏమయ్యా రాఘవయ్యా, మీ బావమరది కమ్యూనిస్టు పార్టీలో చేరాడే" అని హేళనగా అన్నాడు. రాఘవయ్య ఆశ్చర్యపడ్డాడు.

ఒకనాడు రాత్రి పన్నెండుగంటలప్పుడు ఎవరో తలుపు తట్టారు.

రాఘవయ్య తటాలున లేచి, గడగడ వణకుతూ తలుపు తీశాడు. రివ్వున చలిగాలి లోపలికి కొట్టింది. చంద్రం మెల్లగా లోపలికొచ్చి తలుపు వేశాడు. చలికి గడగడ వణకుతూ రాఘవయ్య మాట్లాడలేకపోయాడు.

ఇంతలో సుగుణ లేచి, అమ్మను లేపి "అమ్మా, మామయ్య వచ్చాడు" అని గుసగుస చెప్పింది.

సుధాకరుడు లేచివచ్చి మామయ్యదగ్గర కూచొని విచిత్రమైనజంతువును చూచినట్లు చూచి, "అమ్మా, మామయ్య తడిసిపొయ్యాడే" అని "మామయ్యా, తలతుడుచుకొంటావా?" అని తుండుగుడ్డ తీసుకొచ్చి యిచ్చాడు.

చంద్రం, సుధాకరుడిచేతిని ఒకసారి ముద్దుపెట్టుకొని, తల తుడుచుకోనడం ప్రారంభించాడు.

"సుగుణా, పెట్లో పంచె ఏమైనా ఉందేమో చూడు" అని రాఘవయ్య అన్నాడు.

"వద్దుబావా, వద్దు. నాకు గుడ్డలున్నాయి. ఇప్పుడవసరంలేదు సుగుణా" అన్నాడు చంద్రం.

పెట్లో పంచెలేదని సుగుణకు తెలుసు. అందుకని ఆమె కదలకుండా కూచుంది.

"ఏమిటి చంద్రం, మళ్లీ కమ్యూనిస్టు పార్టీలో ఎందుకు చేరావురా?" అన్నాడు రాఘవయ్య.

"చేరవలసివచ్చింది బావా, పరిస్థితులు అలా మారిపోయాయి" అన్నాడు చంద్రం.

"అదికాదు. స్వరాజ్యం కావాలన్నారు; జైళ్లకుపోయారు; బాగానేఉంది. స్వరాజ్యం వచ్చేసిందికదా! ఇంకా ఎందుకు అవస్థలు పడడం?" అన్నాడు బావ.

"అవస్థలేమున్నాయిబావా? ఎవరికంటె ఎక్కువ అవస పడుతున్నాను నేను?" అని చంద్రం చిరునవ్వు నవ్వాడు.

"బాగానే ఉంది వేదాంతం" అన్నాడు బావ.

"వేదాంతం ఏముంది బావా? ఈనాడు సమాజం మారాలి. ఈ ఆర్థికవ్యవస్థ మారితే నేగాని అందరూ సుఖపడడం అనేది కల్ల. అలా మార్చడం ఈ ప్రభుత్వాలవల్ల కాదు" అన్నాడు చంద్రం. అతని ముఖం కోపంతో కందిపోయిందని, ఆ గుడ్డి వెల్తురులోగూడా రాఘవయ్య గ్రహించాడు.

చంద్రం బయలుదేరాడు; సుగుణ, శేషమ్మ, ఒక్కసారి గాభరాపడ్డారు.

"తెల్లవారకపోవడమూ, రాత్రి వేళ ఇక్కడ ఉండమంటే ఉండలేదేమి?" ... 

"శేపుపొద్దున పోగూడదటరా? ఇప్పుడే, ఈ వానలోనే ఎక్కడికిపోవాలి?" అని శేషమ్మ కోపంతో, అడిగింది.

"పోవాలక్కయ్యా. ఈరోజు రాత్రి ఇక్కడే ఉన్నానంటే, రేపు పొద్దున సంకెళ్లు తప్పవు" అన్నాడు. అందరూ నిశ్చేష్టులై కూచున్నారు.

చంద్రం, తలుపుతీసుకొని, చీకటితో పోరాడడానికి వెళ్తున్నట్లు ఆ గాఢాంధకారంలో కలిసిపోయాడు. గాలి రివ్వున వీచి, అతణ్ణి త్రోసుకుంటూ వెళ్ళిపోయింది.

సుగుణకు మామయ్యమీద పట్టరానికోపం వచ్చింది. "ఈ మనిషిని, మా యింటికి 'రమ్మని ఎవరుపిలిచారు.? రానివాడు రాకుండా నే ఉండకూడదూ? వట్టి మొరటుమనిషి" అని మనసులోనే అనుకొని సుగుణ ఊరుకుంది.

[ఇంకావుంది]




## స్వాతంత్ర్యానికి ముందు 

స్వాతంత్ర్యముగాని అధికారముగాని కష్టపడి ఆర్జించటముతో, బాధ్యత ముగియదు. ఆర్జించట మెంత ఎత్తో - దానిని నిలుపుకోవట మెంత ఎత్తుగానూ ఉంటుంది. సంపాదించినదానితో ప్రజలు సుఖించి, దేశాన్ని అభివృద్ధిపరచి లోక కళ్యాణము చేకూర్చితేగాని స్వాతంత్ర్యము సాఫల్యము కాదు.

వైవాహిక జీవితము దుర్భరమని తోచినప్పుడు కొన్ని షరతులమీద వివాహ విచ్ఛేదము చేసుకొనే అధికారము స్త్రీలకు ప్రస్తుతము లభించబోతున్నది. ఇది అనేక సంవత్సరాల కృషి ఫలితముగా చట్టము కాబోతున్నది. ఈ చట్టము ఒక ఆయుధము వంటిది. దీనిని ఉపయోగించుకొనే మెలకువ, నేర్పు స్త్రీలు చక్కగా తెలిసికొని ఉండటము ఈ సమయములో చాలా ముఖ్యము. అసమర్థులచేత ఈ ఆయుధము పడినట్లయితే దీని చేతనే నష్టపడతారు.

* * *

ప్రస్తుతము స్త్రీలు విద్యావతులు, ఉద్యోగస్థులు, రాయబారులు, మంత్రులు, సంఘసేవికలు, వైద్యులు, వకీళ్లు, ఉపాధ్యాయినులుగా ఇంచుమించుగా అన్ని శాఖలలోనూ ఉన్నారు. కాని వీరందరికంటె సామాన్యస్త్రీలే అధిక సంఖ్యలో ఉన్నారు. సంఘములో ఏవిధమైన మార్పు (మంచిగాని చెడుగాని) వచ్చినా ఆ తాకిడి సామాన్య కుటుంబాలకే తగిలి నేలమట్టము చేసి వేస్తూ ఉంటుంది. సంఘములో కలిగే మార్పులు స్త్రీ పురుషు లిద్దరిలో స్త్రీలనే

ఇల్లిందల సరస్వతీదేవి

ఎక్కువగా బాధిస్తాయి. దీనికి కారణము ప్రకృతి స్త్రీలకు చేసిన అన్యాయ మనుకొన్నా - లేక బాధ్యత అనుకొన్నా - స్త్రీలకు ఇచ్చిన గొప్ప స్థాన మనుకొన్నా, స్త్రీత్వమే (సృష్టికి హేతుభూతమైనది). మధ్యతరగతి కుటుంబాలు సంఘానికి వెన్నెముక వంటివి అనుకుంటున్నాము కనుక ఆ కుటుంబాల విషయము ముందుగా ఆలోచించవలసి ఉన్నది.

స్త్రీలలో వైవాహిక జీవితము జీవిస్తూ మాతలై, ఆరోగ్యము సడలి, గృహకృత్య భారము మోయలేక మోసేవాళ్లే ఎక్కువగా మనకు కనబడుతూ ఉంటారు. వ్రాయటము చదవటము వచ్చినా జీవనోపాధికి తగిన సామర్థ్యము చాలామందికి లేదనటములో సాహసములేదు.

* * *

అస్వతంత్రులవటముచేత మనదేశములో చాలామంది స్త్రీలు తమ జీవితాలలో సరియైన బాధ్యత ఎరుగకుండా ఇంతవరకూ జీవితాలను గడిపారనటములో అతిశయోక్తి ఏమాత్రమూ లేదు. భర్త ఆర్జించిన ధనగౌరవాధికారాలను ధర్మపత్ని హోదాతో స్త్రీ ఇంతకాలమూ అనుభవించటానికి ప్రయత్నించింది. గాని—తనకు స్వశక్తిని కలిగించుకోవటానికి గాని, పెంపొందించుకోవటానికి గాని ఎక్కువ ప్రయత్నించ లేదు. ఫలానావారి సతీమణిగా సంఘములో చలామణి అయి, ఛాయామాత్రివలె - ప్రత్యేకమైన వ్యక్తిత్వములేక - ఒకరు పలికించిన పలుకులనే చిలుకలవలె పలుకుతూ యాంత్రిక జీవితాలను గడపటానికే స్త్రీలోకము అలవాటుపడ్డది. జీవితములో ఒక నిర్ణయము - ఒక ప్రధానాశయమంటూ ప్రత్యేకముగా ఉండటానికి అవకాశము లేకపోయింది. యౌవనారంభదశలో పురు

(30-వ పేజీ చూడండి)

# ★ స్వాతంత్ర్యానికి ముందు ★

షుని మెడలో స్త్రీ ఒక గుదిబండగా తగిలించబడ్డది. ఆ కారణముచేత పురుషుడికి ఆమె జీవితాన్ని తన కనుకూలముగా మలచివేసే అవకాశము లభించింది. అయితే ఇది జరిగినది జరిగినట్టుగా చెప్పటమే కాని, నేరము లెంచటము ఎంతమాత్రము కాదు.

ప్రస్తుతము నారీ లోకము తమ జీవితమును సింహావలోకనము చేసుకోవలసిన సమయము వచ్చినది. ‘తమ సమస్యలేమిటి? – తమ సామర్థ్యమూ ప్రతిభా ఏమిటి? – తమకుగల అవకాశములేవి – వాటి పరిమితులు ఎంతవరకు’ – అని శ్రద్ధగా ఆలోచించి – చర్చించుకోనవలసిన అదను వచ్చింది. నిద్రాణాస్థితిలో నుండి మేల్కొని ప్రతి స్త్రీ తన జీవితాన్ని ఏ విధముగా సంస్కరించుకోవాలో, ఎటువంటి క్లిష్ట పరిస్థితి వచ్చినా సమర్థించుకొనే నేర్పు, ప్రజ్ఞ ఏవిధంగా సంపాదించాలో, తెలిసికొనటానికి ప్రయత్నించాలి. క్రొత్తకళాకాంతులతో తమ జీవితాలను సార్థకపరచుకోవటానికి కృషి చెయ్యాలి.

వారసత్వాధికారము స్త్రీలకు వచ్చినంత మాత్రాన ఆర్థిక సదుపాయాలు కలుగుతాయనుకోవటము పొరబాటు. ఇప్పించే చట్టము వచ్చినా – ఇవ్వటానికి ఎంతమంది దగ్గర ఆస్తి ఉన్నది? విధిలేక విడాకులిచ్చిన స్త్రీకి, లేక ఇవ్వదలచిన స్త్రీకి, కోర్టువారు ధన సౌకర్యము కలిగించేవరకూ క్లిష్టపరిస్థితిలో ఉండవలసి వస్తుంది. ఆ కారణముచేత స్త్రీలు స్వయంపోషకత్వము కలిగిఉండటము ముఖ్యము. అది లేకపోయినా సమయము వచ్చినప్పుడు తన కాళ్లపైన తాను నిలబడగల సామర్థ్యమూ – శక్తీ కలిగిఉండటము స్త్రీకి చాలా అవసరము.

* * *

స్త్రీలు ఎంత చదువుకొన్నా – ఉద్యోగాలు చేస్తున్నా జంకును వదలించుకొన్నవారు తక్కువ. జంకును వదలించుకోవటమంటే నిర్భయముగా ఉండటమని అర్థము; అంతేగాని విచ్చలవిడి అని అపార్థము చేసుకొనగూడదు. చేసేపని మంచిదయి, ఆడేమాట సమంజసమైన దయితే జంకవలసిన పని లేదు. ఆయుధబలములేని గాంధీమహాత్మునికి అంత శక్తి నిచ్చినదేది? విద్యా వైజ్ఞానిక శక్తులకు సత్యమువల్ల చేకూరిన మనోబలమే!

* * *

స్త్రీలు ఒంటరిగా పిల్లలతో కాపురము చేయుటము తెలిసికొని ఉండాలి. బిడ్డల భారము తనపైన పూర్తిగా పడినప్పుడు బిడ్డల శిక్షణ విధానాన్ని తల్లి చక్కగా తెలిసికొని ఉండాలి. చాలామంది తల్లులు బిడ్డలకు భోజనము పెట్టి బట్టలు వేసేవరకే తమబాధ్యత అనుకుంటారు. బిడ్డలకు తల్లి యిచ్చే శిక్షణ కొంత, తండ్రిఇచ్చే శిక్షణ కొంత, రెండూ అవసరమే. తలిదండ్రుల ఇద్దరిబాధ్యత ఒకతల్లే నిర్వహించటానికి తగిన విజ్ఞానము సంపాదించుకోవాలి. తల్లిదగ్గర బిడ్డలు పెరగటమే క్షేమమని కోర్టువారు తీర్పు చెప్పేటట్టుగా తనను సంస్కరించుకోవాలి. తన సంతానాభివృద్ధికై కృషి చేయుటను కష్టించటము అలవరచుకోవాలి.

* * *

ఇంతకాలమూ దంపతులలో ఏవ్యక్తి విచ్చలవిడిగా ప్రవర్తించినా జీవితపర్యంతము ఆ వివాహబంధము శాస్త్రసమ్మతముగా సడలలేదు. ప్రస్తుతము వైవాహిక జీవితమును ప్రకాశవంతము చేయుటానికి వివాహవిచ్ఛేద చట్టము లభించబోతున్నది. ఈ చట్టము ఒక కత్తెరవంటిది. వైవాహిక జీవితమొక దారమయితే ఈ చట్టమొక కత్తెర వంటి దనుకుందాము. దారము చిక్కుపడి ముడిపడినప్పుడంతా ఈ కత్తెర నుపయోగించటానికి ప్రయత్నించకూడదు. చిక్కులను మెల్లగా విడదీసుకోవాలి. వైవాహిక జీవితము ఆనందనిలయమూ – సుఖమయమూ చేసుకోవటానికి తగిన నేర్పు ప్రజ్ఞ ఆర్జించుకోవాలి.

* * *

మన రాజ్యాంగ విధానము ననుసరించి ఏ వ్యక్తి అయినా కొన్ని నిబంధనలకు, కొన్ని చట్టాలకూ బద్ధుడయి ఉండవలసినదే. అప్పుడుగాని ప్రజలకూ దేశానికీ క్షేమము కలుగదు. ఆ విధముగానే సాంసారిక జీవితములో కూడా స్త్రీపురుషులు సమదృష్టితో ఏర్పరచుకొన్న నిబంధనలకు బద్ధులయి సమిష్టి జీవితాలను సడలని బంధనాలతో బంధించుకునే ప్రయత్నాలు చేయటము అవసరము. సంసారములో ఎవరి జీవితాశయాలు వారివయితే దంపతులా సంసారాన్ని చెరిఒక ప్రక్కకు లాగినట్లవుతుంది; పర్యవసానముగా సంతానము దెబ్బతిం

టుంది. మన సంసారాలలో చాలావరకూ ఇటువంటి సందర్భాలే ఎదురవుతూ ఉంటాయి. ఒక సమిష్టి పథకము ఒక నిర్ణయము లేకుండా స్వేచ్ఛగా జీవించటానికే దంపతులు అలవాటు పడ్డారు. ఈ నిద్రాణస్థితిలోనుంచి ఇద్దరూ మేల్కొనటము సంసారాభ్యుదయానికి సోపానము. దేశకళ్యాణముకొరకు పంచవర్ష ప్రణాళిక ఎన్ని శక్తులతో పనిచేస్తున్నదో గ్రహించి, దానిని తమ జీవితాలకు అన్వయించుకోవాలి. దేశక్షేమమంటే కుటుంబక్షేమమూ తరువాత వ్యక్తిక్షేమమూ అని తెలిసికోవాలి. ఇది దంపతుల కర్తవ్యము.

* * *

వైవాహికజీవితములో దుర్భరమైన సమస్యలను విడాకులద్వారా పరిష్కరించుకోవచ్చు. దుర్భరముగా తోచే సమస్యలు కొన్ని వస్తూఉంటాయి. వాటిని ఒకరినొకరు అర్థం చేసుకొంటూ సరిదిద్దుకొని చక్కపరచుకోవచ్చు. అజాగ్రత, అలసత, అలక్ష్యము మొదలైనవి దిద్దుకొంటే చక్కబడే సమస్యలే. వ్యభిచారబుద్ధి త్రాగు కూడా శ్రుతిమించకముందు చక్కబడే అవకాశా లున్నాయి. ఒకరినొకరు అర్థము చేసుకొని మన్నించుకొంటే అటువంటి సమస్యలు కలుగనే కలుగవు. ఒకవేళ కలిగినా దంపతులలో ఒకరిని సరిదిద్దే అధికారము మరొకరికి ఉన్నది. "భర్త స్వామి అయితే భార్య స్వామిని - దంపతు లిద్దరు ఒకరి కొకరు యజమానులు - సంసార బాధ్యత పరస్పర సహకారముతో నిర్వర్తింపబడాలి" అని గాంధీజీ యువతీ యువకులకు బోధించారు. సంఘములో చెడ్డపనులు చేసే అవకాశములేక, కొంతమంది ఏవిధంగా మంచివాళ్లనిపించుకుంటున్నారో - ఆ విధముగానే మంచిపని చేసే అవకాశములేక కొందరు చెడ్డవాళ్లనిపించుకుంటున్నారు. వైవాహిక జీవితములో శాంతిసుఖములు తొండవించాలంటే దంపతులు ఓరిమిని విరివిగా వచ్చించాలి చిన్న చిన్న పొరపాట్లను క్షమించుకోవాలి. ఒకరినొకరు మన్నించుకోవాలి. ఒకరి కష్టసుఖాలను మరొకరు అర్థము చేసుకోవాలి. బిడ్డలతో రాత్రింబగళ్లు అవస్థపడే భార్య నిరంతరమూ తన సేవలో మునిగి తేలలేదనీ, తనతో స్వేచ్ఛగా గడపలేదనీ - అదొక లోపముగా ఎంచి హింసించే పురుషులూ, ఆదాయము చాలక సాయంత్రముకూడా అధికముగా పనిచేసి (*Part - Time jobs*) అలసివచ్చిన భర్తలో దోషములను వెదకి తనను అలక్ష్యము చేసున్నాడని వాపోయే స్త్రీలూ, ఎక్కడికిపోతే సుఖపడతారు? కాన్పులవల్ల అనారోగ్యము పాలయిన భార్యమీద పెనిమిటి విసుగుపడితే అర్థమున్నదా? ధనాభావముచేత తనను సినిమాలకూ క్లబ్బులకూ తీసుకొనిపోని భర్తకు తనమీద ప్రేమలేదనిగాని, భర్త మనసు మారిపోయినదనిగాని భార్య కించపడితే సహేతుకమా? ఈ కారణాలచేత గోరంతలు కొండంతలు చేసుకొని వ్యక్తులను మార్చుకొన్న మాత్రాన సుఖము కలుగుతుందా? వ్యక్తియొక్క గొప్పతనము చిన్న చిన్న విషయాలనూ సమస్యలనూ పరిష్కరించుకొని ఓరిమితో సాధించుకొన్నప్పుడే బయటపడుతుంది. దంపతులమధ్య సామరస్యము కుదరకపోయిన యెడల పురుషునికి సుఖములేదు, కాని - స్త్రీకి సుఖములేకపోగా హానికూడా ఎక్కువగానే అంచనా వేయబడ్డది. సుఖమయమైన సాంసారిక జీవితము ఒక కళకు చెందినది. పరస్పరాభిప్రాయములను సహృదయముతో వెల్లడించుకోవటము, వాటిని తమ జీవితాలకు అన్వయింపచేసుకోవటము దంపతులు అభ్యసించవలసినవి. ఇవి శాంతియుతమైన సమిష్టి జీవితానికి సోపాన క్రియలు.

* * *

ప్రపంచములోగల అన్ని వస్తువులలో దేనివల్ల మానవునికి సుఖము కలుగుతుందని కొందరు పరిశోధించి తృప్తివల్లనని నిర్ణయించారు. ఈ తృప్తి అనే పదార్థము మానవునిలో లోపించినంతవరకు రాజ్యాలమధ్య యుద్ధాలు, వ్యక్తులమధ్య కలహాలు వైమనస్యాలు, కలుగుతూనే ఉంటాయి. ఇది లోపించినందువల్ల పెద్ద ఎత్తుమీద ప్రపంచశాంతి కొరవడుతుంది; చిన్న ఎత్తుమీద ఆలోచిస్తే వ్యక్తికి మనశ్శాంతి ఉండదు. ఎన్ని దేశాలు తిరిగినా ఎంత ధనమూ వ్యయముచేసినా మానవుడు పొందలేని సుఖము, కూర్చున్నచోటనే చిల్లిగవ్వ వ్యయము లేకుండా తృప్తివల్ల పొందవచ్చు. ఈ పదార్థము కొనడానికి దొరికేది కాదు. విశాలహృదయముతో - సిసలైన విజ్ఞానముతో మానవుడు స్వయంకృషివల్ల ఉత్పత్తి చేసుకొనవలసినది. విజ్ఞానవంతమూ వైశాల్యమూ నైన హృదయక్షేత్రములో పండే బంగారుపంటే తృప్తి. ఈ ముడి పదార్థాన్ని విరివిగాపండించుకొని మానవుడు తన





# స్వాతంత్ర్యానికి ముందు

**జీవితానికి మెరుగులు దిద్దుకొని రాతాజాల కంటె గొప్పవారు కావచ్చు.**

* * *

వైద్యులు ఒకప్రక్క వ్యాధులకు చికిత్స చేస్తూ, మరొకప్రక్క వ్యాధులురాకుండా కాపాడుకొనే విధానాలనుగురించి ప్రచారము చేస్తున్నట్లుగానే, స్త్రీలకు సాంసారిక జీవితములో కలిగే చిక్కులను విడదీసుకొనే విధానాలను, అవి కలుగకుండా కాపాడుకొనే ఉపాయాలను గురించి మహిళాసంస్థలు బాగా కృషిచేయాలి. పరిశోధనలు చేయాలి. సుఖమంటే ఏమిటి - ఆనందమంటే ఏమిటి - నిజమైన సుఖము దేనిలో ఉన్నది! మొదలైన విషయాలను స్త్రీలు బాగా అర్థము చేసుకొనేటట్లు చేయాలి. స్త్రీలలో విద్యావ్యాప్తే గాకుండ అన్నిరకాల చేతిపనులు, టైలరింగు, టైపు రైటింగు, అద్దకము, నేత్రపుపని మొదలైన వాటిలో స్త్రీలను ప్రవీణలుగా చేయాలి. మహిళాసంస్థలు స్త్రీలకు వృత్తులను కల్పించాలి. అనాథలకు ఆశ్రయమిచ్చి కాపాడాలి. స్వాతంత్ర్యసమరానికిముందు గాంధి మహాత్ముడు విదేశవస్తు బహిష్కరణను ప్రవేశపెట్టి, దేశీయులలో స్వశక్తిని పెంపొందింప చేసినట్లే, మహిళా సంస్థలు స్త్రీలలో స్వశక్తిని పెంపొందించాలి. స్త్రీజనాభ్యుదయముకొరకు సాధింపబడిన ఈ చట్టముతో స్త్రీలు లాభము పొందేటట్లు చూడటమూ, సంధికాలములో స్త్రీలకన్యాయము జరుగకుండా చూడటమూ మహిళాసంస్థల కర్తవ్యము. తోటి స్త్రీలు కష్టపడకుండా కాపాడటము ప్రతి స్త్రీవిధి. ఏ కార్యమును గాని వ్యక్తులు విడి విడిగా సాధించలేరు; కనుక సమష్టిగా సంస్థలద్వారా సాధించటమే శ్రేయస్కరము.

స్వాతంత్ర్యము స్వయంకృషిచేసి ఆర్జించుకోవాలిగాని, యాచించటము అసమర్థ్య లక్షణము. ప్రతి స్త్రీ తన శక్తి సామర్థ్యాలతో గౌరవము, స్వాతంత్ర్యము సంపాదించటము నేర్చుకోవాలి. ప్రతి స్త్రీ తనకొక జీవితమూ, ఆ జీవితానికొక కర్తవ్యము, వ్యక్తిత్వమూ ఏర్పరచుకొని వాటిని నిలుపుకోనటానికి ప్రయత్నించాలి. ★

## వనితాలోకం:



# డబ్బు విలువ



ఆదాయాన్ని బట్టి సంసారాన్ని పొదుపుగా నిర్వహించేబాధ్యత స్త్రీపురుషులిద్దరిమీదా వుంది. కానీ తరుచు పురుషులలోవుండే కార్యదక్షత స్త్రీలలో కనుపించదు. ఆర్థికస్తోమత లోపించినప్పుడు జీవితంలోని వాస్తవిక పరిస్థితులని సమగ్రంగా అర్థంచేసుకుని, సంసారాన్ని చక్కదిద్దుకోలేని యిల్లాలు అనేక సమస్యలని ఎదుర్కొనక తప్పదు. ఎనభైరూపాయల జీతగాడి భార్య అయిదువందల జీతగాడిభార్య అనుభవించే సౌకర్యాలని కోరుకోవటం అవివేకం. కానీ కొందరు ఆకోరికలని అంత సులభంగా పోగొట్టుకోలేరు భర్త సంపాదనలో, తమ స్థితిగతులలో నిమిత్తం లేకుండా అసంతృప్తి ప్రకటిస్తారు. అటువంటి స్త్రీని పురుషుడు కేవలం తన జీతం తను సంపాదిస్తున్న ప్రతి కానీ భార్య ఏ విధంగా వ్యయంచేస్తోందా అని పరీక్షిస్తూ, వంటయింట్లో పోపుల పెట్టెదగ్గరనుంచీ తనిఖీ చేస్తూ నసపెట్టే పురుషులు వున్నారు. వారి ప్రవర్తన హాస్యాస్పదంగా ఉన్నప్పటికీ, భార్య మనస్తత్వాన్ని విచిత్రంగా మార్చివేస్తుంది. ఒక సమయంలో డబ్బు వ్యయం చెయ్యటానికి భార్యకు స్వతంత్ర మిచ్చి, ఆ తరువాత జరిగినదానికి సంజాయిషీ అడిగి, గగ్గోలుపెట్టే పురుషులు మటుకు ఎన్నటికీ క్షమార్హులు కారు. ఆదాయంలో ఎక్కువభాగం తమ స్వంతఖర్చులకీ, గోల్డుఫ్లేకు సిగరెట్లకి ఖర్చు పెడుతూ, భార్య సామాన్య అవసరాలని తీర్చలేక విసుక్కునే పురుషులు లేకపోలేదు. అటువంటివారు వివాహమే చేసుకోకుండా బైరాగుల్లో కలిస్తే బాగుంటుంది. భార్య

## కొమ్మూరి ఉషారాణి

కరిగించటానికి ఉద్భవించిన వ్యక్తికిందా, పరాయిదానికిందా జమకడతాడు. ఆసంపాదనమీద ఆసక్తి, సొంతవారిని పోషిద్దామనే వాంఛ గూడానశించవచ్చు. ఎంతో చదువుకుని ప్రపంచజ్ఞానం మలవరచుకున్న స్త్రీ ఈ బలహీనతకు గురికావచ్చు. విద్యాశిక్షణలకు అంతగా నోచుకోని యిల్లాలుఆర్థికపరిస్థితుల కనుగుణంగా సంసారాన్ని చక్కబెట్టుకోవటములో మంచి నైపుణ్యాన్ని కనబరచవచ్చు అది వారి వారి శిక్షణనీ పరిస్థితులనీబట్టి వుంటుంది.

ఒకొకప్పుడు స్త్రీ పురుషుల విచిత్రప్రవర్తనగూడా కొన్ని చిక్కులకి కారణమవుతుంది. భర్త సంసారపు ఖర్చుకి యిచ్చినదాంట్లో కొంత రహస్యంగా దాచి, చీరలూ నగలూ కొనుక్కోవటములో కొందరు స్త్రీలు అనిర్వచనీయమైన ఆనందాన్ని పొందుతారు. తమకు మంచి బట్టలూ, నగలూ లేవని సాహచర్యాలకీ పరిచయాలకీ దూరమయే బలహీనత స్త్రీలలో తరుచు కనబడుతుంది. సంసారాన్ని ఎలా నడుపుతోందా అనే ఆలోచన, కనీసం కుతూహలం, బొత్తిగా లేకుండా, ఆమె కోరినదే తరువాయిగా అప్పులకోసం పీధినబడే పురుషులని చూస్తే మటుకు జాలివేస్తుంది. ఈరకం వైపరీత్యాలు కుటుంబ ఆర్థిక పరిస్థితుల కనుగుణంగా సంసారాన్ని నడవనీయకుండా, భార్యాభర్తలమధ్య మనస్పర్థలనీ చిక్కులనీ తెచ్చిపెడతాయి

"కష్టాలు మనుష్యులని ఉదారులుగా చెయ్యవు. స్వార్థపరులుగానూ, అల్పులుగానూ, నీచులుగానూ తయారుచేస్తాయి" అన్నాడు సోమర్‌సెట్ మాహామ్ ఆర్థిక మాంద్యంవల్ల సామాన్య కుటుంబీకులు చెయ్యవలసిన త్యాగాలు వారిని విచిత్రంగా తయారుచేస్తాయి. వచ్చే రాబడితో సంసారాన్ని దిద్దుకోలేని యిల్లాలి అసంతృప్తి ఒక మనోవ్యాధిగా పరిణమిస్తుంది. ఆమె జీవితంలో పాలు పంచుకునే భర్త సహజంగా ఆ రకం మనస్తత్వానికి మానసిక అనారోగ్యానికి గురి అవుతాడు. ధనం జీవి



## ★ డబ్బు విలువ ★

కావసరాలను తీర్చగల ఒక పరికరమేననీ, దానివల్ల యితర మానసిక సౌఖ్యాలకీ, ఆహ్లాదాలకీ దూరమయే అవసరంలేదనీ గ్రహించక పరస్పరం నిందించుకుంటూరు. పోట్లాడుకుంటారు. అర్థంలేని నిరాశతో మనో వ్యథతో కృశించిపోయి, యింటిని ఓ నరకంలా తయారుచేసుకుంటారు.

అటువంటి మనస్తత్వంవల్ల కలిగే దుష్ఫలితాలు వారిద్దరిమధ్యే చెలరేగి అణగిపోవు. తల్లితండ్రు లిద్దరూ ఆర్థికమాంద్యంవల్ల కీచులాడుకుంటున్నా, తల్లి ఏ చీరకోసమో నాలుగు రోజులు ఉపవాస దీక్ష సాగించినా, తండ్రి అప్పులవాళ్లు యింటిమీద కొచ్చినప్పుడు సమాధాన మివ్వలేక తన్నుకుంటున్నా, డబ్బు విలువమీద పిల్లలకి విచిత్రమైన అభిప్రాయం కలగడమే కాదు, అసలు జీవితమే భయంకరంగా గోచరిస్తుంది.

పిల్లలకి డబ్బు విలువనిగురించి కొద్దిగా తెలియజెయ్యటం తల్లి విధ్యుక్త ధర్మమే కావచ్చు. కానీ అందులోనూ ఒక తీరువుంది. చింపిరి బట్టలతోనూ, మాసిన గడ్డంతోనూ వీధిన బోయే ముష్టివాణ్ణి చూపించి, 'మీరు డబ్బు అనవసరంగా ఖర్చు పెడితే అలా అయిపోతారు' అని పిల్లలకి చూపెట్టడంలో అర్థంలేదు. రెక్కల మీద ఆధారపడే ప్రతి సామాన్యకుటుంబంలోనూ, డబ్బు సంపాదించటానికి కొంత 'ప్రయత్నం' చెయ్యాలని, ఒకసారి వ్యయంచేసిన డబ్బు తిరిగిరాదనే విషయం పిల్లలకి బోధపరిచే వాతావరణం దానంతటదే ఏర్పడుతుంది. అటువంటి సందర్భాలలో డబ్బు విలువనిగురించి పిల్లలకి నేర్పటము పొరబాట్లు జరగటానికి అవకాశముండదు. కానీ భర్త పండక్కి కొత్త బట్టలు కుట్టించనంతమాత్రాన, అమ్మాయిని ఎదురుగా కూర్చోబెట్టుకుని "అయ్యో! నా తల్లీ! నీకెంత గ్రహచార మొచ్చిపడిందే! ఈ దరిద్రురాలి కడుపున పుట్టావు పండక్కి కొత్త బట్టలకైనా నోచుకోలేదు" అని రాగాలు మొదలెడితే పిల్లలు అనేకవిధాల నష్టపడతారు. ఆర్థికపరిస్థితుల కనుగుణంగా యిల్లు చక్కబెట్టుకోలేని శక్తి స్త్రీలలో ఒక్క అసంతృప్తిని కలిగించడమే కాదు, తరుచు పిల్లలని కసురుకుని, కొట్టే స్వభావాన్ని కలుగజేస్తుంది. ఆక్షణంలో కాకపోయినా, అటువంటి సంఘటనలు పిల్లల భావి జీవితంలో వింత మనస్తత్వాలకీ, చిక్కులకీ దోహద మిస్తాయి.

ధనార్జన, గృహనిర్వాహణ స్త్రీ పురుషులు ప్రత్యక్షంగా నిర్వహించే విధులైనప్పటికీ ఈ రెండింటినీ వేరుచేసి ఆలోచించడము పొరబాటు. భర్త ఏవిధంగా ధనార్జన చేస్తున్నాడో తెలియక, అతను కేవలం జీతంరాళ్లు తెచ్చే ఒక 'యంత్ర' మనీ, తనకు వ్యయం చెయ్యటానికి ప్రత్యేక హక్కువుందనీ, భార్య భావించినంత కాలం ఆ సంసారంలో సమన్వయం కుదరదు. సామాన్య కుటుంబంలోని స్త్రీలని కొన్ని ఆనందాలకీ సౌఖ్యాలకీ అతీతులను కమ్మని కోరటం అసహజమే కావచ్చు. కానీ వాస్తవ జగత్తులోని కొన్ని సత్యాలని గ్రహించి ఆచరణ జ్ఞానం అలవరచుకుంటే, సంసారంలో శాంతి నెలకొల్పటమే కాదు, పిల్లల భావిజీవితం ఒక జ్యోతి వెలిగించ గలుగుతారు. ★

## ★ ఆత్మవిశ్వాసం ★

వి. ప్రభావతిగారు ఇలా వ్రాస్తున్నారు:—

20-10-54 వ తేది ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రికలో కొమ్మూరి ఉషారాణిగారు వ్రాసిన 'ఆత్మవిశ్వాసం' అనే వ్యాసం చదివాను. అందులో ఒక కథను ఉదహరిస్తూ, కథలో నాయిక "ఆత్మవిశ్వాసంతోను, ప్రతిఫలాపేక్ష లేకుండా, పరులను మెప్పిస్తున్నానా లేదా అనే ఆలోచన లేకుండా కేవలం మనుష్యుల మంచితనంలో తనకున్న విశ్వాసంతోనే, ఆ కథలోని నాయకుని హృదయంలో పరివర్తన కలిగించిందనీ," అవిధంగా సత్ప్రవర్తనతోను, మనుష్యుల మంచితనంలో మనకున్న గాఢవిశ్వాసంతోను, ఎదుటి వ్యక్తులలో పరివర్తన కలిగించవచ్చునీ ఆమె సూచించారు.

'ఆత్మవిశ్వాసం' వుండటంవల్ల—"బాహ్య శక్తులు మనను కదిలించకుండా మనలో ఏ విధమయిన అశాంతికి తావీయకుండా" జీవితంలో ఒక మార్గాన్ని అనుసరించి ముందుకు వెళ్లగలమనేది మాత్రం అక్షరాలా నిజం. కాని కేవలం మనుష్యుల మంచితనంలో మనకున్న విశ్వాసంతోను, మన ప్రవర్తన వల్లనే, కఠినులైన వ్యక్తుల హృదయాలలో పరివర్తన కలిగించగలమా అనేది చర్చనీయాంశము. అంతమాత్రంచేత నాకు మానవత్వం మీద విశ్వాసం నశించిందనుకోనవరంలేదు.

నాయికను వంచించాలని కంకణం కట్టుకుని, ఆమె 'ప్రవర్తనలోని లోపాలనే పరిశీలించాలని' అనుక్షణం ప్రయత్నించిన నాయకునిలో, చివరికి ఆ సంఘటన వల్లనయినా పరివర్తన కలిగిందంటే, అతనిలో వున్న కాఠిన్యం వెనుక కొంత సంస్కారం దాగివుందనీ, అతనిలో మానవత్వం ఇంకా మిగిలివుందనీ మనకు స్పష్టంగా తెలుస్తోంది. — నాయకుడు జమిందారు బిడ్డ కావటంవల్ల ఒక అనాథబాలిక ఆ యింట్లో విశిష్టస్థానం సంపాదించటం, ఆమె వ్యక్తిత్వం పైకిరావటం - వీటివల్ల అతనిలో వున్న అహం దెబ్బతిని, ఈర్ష్యాద్వేషాల కతీతుడుగా ప్రవర్తించలేక పరిస్థితుల ప్రభావానికి లొంగిపోయాడు; చివరికి నాయిక ప్రేమని, వాత్సల్యాన్ని చూరగొన్న తరుణంలో అతనిలో వున్న కాఠిన్యం కరిగి కనువిప్పు కలుగుతుంది. — ఇది కేవలం నాయికలో వున్న ఉదాత్త ప్రకృతివల్ల, ఆమె సత్ప్రవర్తన వల్లనే కాక, అతనిలోను కొంత సంస్కారం ఉండటంవల్ల, అతనికీ "హృదయం ఉండటం"వల్ల, ఆ సంఘటన జరిగినప్పుడయినా అతనిలో హృదయ పరివర్తన కలిగింది.

అదేవిధంగా వాస్తవిక జీవితంలో కూడ ఎంత కఠినులైనా మనని సానుభూతితో అర్థంచేసుకుని, మన మంచితనాన్ని ఏనాటికైనా గ్రహించగల శక్తి, ఆ సహజ సంస్కారం కొంతయినా మిగిలివున్న వ్యక్తులయితేనే వారిలో పరివర్తన కలుగుతుంది. అంతేకాని, కేవలం మన ప్రవర్తనవల్ల,





జడసింగారం

ఫోటో: ఎన్. రామకృష్ణ.

 ## ఆత్మవిశ్వాసం 

మానవత్వంమీద మనకివున్న విశ్వాసంవల్ల, కఠినులైన వ్యక్తులందరిలోను పరివర్తన తేవటమనేది అసాధ్యం. అయితే ఆత్మవిశ్వాసం వుండటంవల్ల వ్యక్తిగతంగా మాత్రం ఒక మేలు కలుగుతుంది - ఎదుటి వ్యక్తుల కాఠిన్యానికి ఆహుతి కాకుండా, కాఠిన్యశక్తుల ప్రభావానికి లొంగిపోకుండా, మనని మనం రక్షించుకొని, కష్టాలను చిరునవ్వుతో ఎదుర్కొంటూ జీవితయాత్ర సాగించగలం. కొమ్మూరి ఉషారాణిగారు సహృదయంతో అర్థంచేసుకుని దీనికి సమాధానమిస్తారని ఆశిస్తున్నాను."

ప్రభావతిగారూ కేవలం మానవుల మంచితనంలోని నమ్మకమూ, సత్ప్రవర్తన వల్లనే కఠినులలో హృదయ పరివర్తన తేగలమా అనే సంశయాన్ని వెల్లడిస్తున్నారు. ఎవరుగాని ఆత్మవిశ్వాసంతో తమ జీవితాలను తీర్చి దిద్దుకోవటానికి ప్రయత్నిస్తారేగాని, ప్రతి వ్యక్తిలోనూ పరివర్తన తేవటానికి పూనుకోరు. ఆ వ్యక్తులు స్వజనులు, ఆప్తులు అయితే ఆత్మవిశ్వాసంవల్ల, [illegible] వర్తన సాధించడానికి అవకాశం ఉంటుంది. కేవలం ఒక్క వ్యక్తి సత్ప్రవర్తనద్వారా సమాజంలోని యితర వ్యక్తు లందరిలోనూ పరివర్తన కలుగుతుందని అనుకోనవసరంలేదు. ఇంతే కాదు. కథలలోనూ సినిమాలలోనూ తప్ప నూటికి నూరుపాళ్లు దుష్టులు వాస్తవంగా సమాజంలో కనపడరు. ప్రతిమనిషిలోనూ ఏదో విధమైన సంస్కారం అంతో ఇంతో ఉంటుందని ఒప్పుకోక తప్పదు.



# ప్రమాదవశాత్తు మరణించింది

పొద్దున్నే ఐదున్నరకి లేవాలి. వీధి, దొడ్డి తుడిచి, నీళ్లు జల్లాలి. నిన్నటి వంటకు వాడిన రాసెడు అంట్లూ తోమాలి. పశువులపాక సాఫుచేసి రెండు బర్రెల పాలూ పితకాలి. ఇంటిల్లిపాదికీ లేచేటప్పటికి పళ్లు తోముకునేందుకు నీళ్లు తోడాలి.

ఏడింటికి అందరికీ కాఫీ సిద్ధం చెయ్యాలి. తను మాత్రం తాగకూడదు. ఎందుకంటే మామగారి మేనత్త కాఫీ తాగినవాళ్ల చేతి మీదుగా అన్నం తినదు. ఎనిమిదింటికి మడి గట్టుకుని పదింటిలోపల పదిమందికీ వంట చెయ్యాలి. లేకపోతే భర్త కోర్టుకు పోవడం ఆలస్యమవుతుంది. ఈలోపల అందరికీ స్నానాలకి వేడినీళ్లు సప్లై చెయ్యాలి. మధ్యలో ఆడబడుచు లెవరన్నా కాఫీలకి ఆర్డరిస్తే, ఆ పురమాయింపులన్నీ ఆగరించాలి. మడి మాత్రం చెడకూడదు. వేళకి మరదిని కాలేజీకి, భర్తను కోర్టుకు పంపాలి.

మామగారు 11-30 కు గాని తినడు. ఆయన తినందే ఆడవాళ్లెవరూ విస్తరి వేసుకోకూడదు. అందరూ తింటేగాని తను తినలేదు.

మళ్లా భర్తకు రెండు గంటలకు టిఫినూ, మూడు గంటలకు అందరికీ 'టీ'. ఇవన్నీ అయ్యేటప్పటికి రాత్రివంట. రాత్రిపని ముగిసేటప్పటికి పది అవుతుంది. అందరికీ పక్కలు అమర్చి, తర్వాత తను నిద్రపోవాలి.

కాపరానికి వొచ్చినప్పట్నించీ సూక్ష్మంగా చంద్రకాంత దినచర్య ఇది. లోకంలో బానిసత్వం తొలగిపోయిందనే అపభ్రమలో ఎవరన్నా వుంటే చంద్రకాంతవంటివాళ్లను ఎంతోమందిని చూపగలను—'తిరగబడక, ఈ శతాబ్దంలో కూడా అదేం ఖర్మ!' అంటే చెప్పలేను.

ఇంతయినా ఆఇంట్లో ఒకళ్ళకి చంద్రకాంతమీద ప్రేమ, సానుభూతి అనేవి లేవు. రుచులు కుదరలేదనో, పెరుగు పులిసిందనో, నీళ్లు మరగలేదనో ఈసడింపులూ, సాధింపులూ.

విధవాడబడుచుకి వేరేపనే లేదు. తిని కూచుని 'ఆడబడుచు అర్ధమొగుడు' అంటూ దీర్ఘాలుతీస్తూ, చంద్రకాంతని కోసి పెట్టడంతప్ప వేరేపనిలేదు.

చంద్రకాంతతండ్రి గౌరవకుటుంబీకుడు. కుటుంబరావు పేరుకు తగినట్టే కుటుంబం కూడా పెద్దదే; నలుగురు మొగపిల్లలూ, ఆరుగురు ఆడపిల్లలూ. అందులో ఆఖరామె చంద్రకాంత. తరతరాలు ఊరికే కూచుని తినడంవల్లా, ఆరు పెళ్ళిళ్ళు అమోఘంగా చెయ్యడంవల్లా కుటుంబపరిస్థితి ఆర్థికంగా చితికిపోయినా, గౌరవప్రతిష్ఠలవిషయంలో వేలెత్తి చూపలేరెవరూ.

ఆఖరిబిడ్డ చంద్రకాంత ఎంతో గారాబంగా పెరిగింది. చంద్రకాంత సుఖపడదని ఎవరూ అనుకోలేదు; ఆ భయమే కలగలేదు.

చంద్రకాంతభర్త సర్వేశ్వరరావు ప్లీడరీ చేస్తున్నా భారమంతా సర్వేశ్వరుడిమీద వదిలేసి, పెత్తనమంతా తండ్రికీ, అక్కగారికీ వొదిలి, నాలుగురాళ్లు తెచ్చి ఇంటో పడెయ్యడమే ఆశయంగా గల సాత్విక మహాశయుడు.

**కాంతి రామమూర్తి**

తండ్రీ, విధవక్కగారూ, పెళ్లికాని చెల్లెలూ, కాలేజీలో చదివే తమ్ముడూ, తండ్రి మేనత్తా—అందర్నీ అతనే పోషించాలి.

చంద్రకాంత దినచర్య చెప్పడంలో నా వుద్దేశం ఆవిడకష్టాలన్నీ ఏకరువు పెట్టి మీ సానుభూతిని పొందేలా చెద్దామని కాదు.

అంతకంటె ఎక్కువగా కష్టపడే వాళ్లు కూడావుంటారు. ఐనా ఏమాత్రం సౌఖ్యపు ఛాయల దరిదాపులకైనా చంద్రకాంతలా చేరనివాళ్ళు అరుదుగా వుంటారనుకుంటాను. భర్తప్రేమని పొందగలిగినట్టయితే చంద్రకాంత అంతకంటె రెట్టింపు కష్టాన్ని భరించగలిగేది. సర్వేశ్వరరావు స్వభావాన్ని చిత్రించడం కష్టం. ఈక్రింది సంఘటన విన్నాక ఏమనుకోవాలో నాకే తెలీలేదు.

* * *

సర్వేశ్వరరావు ఏడున్నర గంటలకు భోజనంచేసి మామూలుగా క్లబ్‌కి పోతాడు. రాత్రి పదైతేగాని రాడు. అందులో ఆడేది కాంట్రాక్ట్ బ్రిడ్జి. ఒక్కోరోజు రాత్రి రెండు గంటలుకూడా అయ్యేది.

చంద్రకాంత పనులన్నీ పూర్తయ్యాక తన గదిలోకి పోయి, భర్తకోసం నిరీక్షించి, నిరీక్షించి, నిద్రపోయేది.

ఆ రోజున తలుపు తట్టినట్టయింది. వెళ్లి తలుపుతీసింది.

ఎదురుగా మామగారు! చిరునవ్వుతో "ఏమే, కోడలా ఏంచేస్తున్నావ్?" అన్నాడు.

చంద్రకాంత ప్రాణం పైకెగిరిపోయినట్టయింది. మాడలిపోయింది. వెంటనే తలుపులు బిగించుకుంది. గుండెలు వేగంగా కొట్టుకోసాగాయి. కాళ్ళు వణకసాగాయి. భయంతో క్రుంగిపోయింది.

మామగారి విసుపుదగ్గూ, సకిలింపూ వినబడ్డాయి...

మర్నాటినించి విధవాడబడుచు కొత్త ఫర్మానా జారీచెయ్యసాగింది: 'తండ్రి నీళ్ళుపోసుకున్నంతసేపూ, అన్ని చేదలూ నీళ్ళు చేదాలని.' "మామగారంటే దైవసమానుడు. అలాంటివాళ్ళకు ఏ సేవైనా చెయ్యాలి" అని బోధచేసింది.

"మీ నాన్నగారుకదా; నువ్వు మాత్రం సేవ చెయ్యకూడదా" అందామనుకుందో, అందో చంద్రకాంత; నరరూప రాక్షసి లాంటి ఆ యిల్లుబట్టిన విధవాడబడుచు మీద విరుచుకుపడింది: "నాకే ఎదురు చెబుతావుటే! అమాత్రం మామగారికి సపర్య చెయ్యకూడదూ? పత్తిత్తువు బయలుదేరావని. చూడండి ఎంత పొగరో? శతకోటి జంగాల్లో బోడిజంగమని, ఆక్కడికి తానొక్కర్తే పతివ్రతాశిరోమణి ఐనట్టు" అంటూ. ఇంటి పెంకులు ఎగిరిపోసాగాయి.

మన దేశంలో మధ్యతరగతి కుటుంబాల్లో వితంతువులు చేసే అఘాయిత్యాలు ఇంతా అంతా కాదు! ప్రతి ఇంట్లోనూ వాళ్ల మూలంగా ఎంత గోల జరుగుతుంది. ఈ మాటలు రాసేది స్త్రీజాతిని, వితంతువుల్ని కించపర్చాలని కాదు. వాస్తవ విషయమంతే!

అయితే అలా ఎందుకు జరుగుతుంది అంటే కారణం లేకపోలేదు. మానవులకు సహజమైన జీవితంనుండే వాళ్లు బలవంతంగా వేరుచేయబడతారు. దానికి కారణం, మతం, పురాతనాచారాలు మొదలైనవి.

(49-వ పేజీ చూడండి)

# బొమ్మరిల్లు

## జోస్యం పంతులు

భాస్కరం, ప్రభాకరం

"జోస్యం పంతులు జోస్యం మాత్రం
ఝూటా లేనిది, ఖరారైనది
అల్లాటప్పయ పంతులు చెప్పే
కల్లబొల్లి కథ కాదండీ!

ప్రశ్న చెప్పడం, చేయిచూడడం
పంచాగాలు తయారు చేయడం
ఏమను కుంటున్నారో గానీ
ఎంతో శ్రమపడి నేర్చాను!"

అరుగుమీద తిష్ఠేసిన పంతులు
అల్లా కోతలు కోసేస్తుంటే
ఆశ్చర్యంగా నోరు తెరుచుకుని
అందరు జనులూ విన్నారు!

అక్కడ చేరిన మొండి ఘటాల్లో
అల్లరి హనుమంతయ్య వున్నాడు
"ప్రశ్న చెప్పడం అంటే ఏమిటి
పంతులుగారూ?" అన్నాడు.

"ఏదో వొక విషయాన్ని తలుచుకుని
"ఇది అవుతుందా, అవదా" అనుకుని
ఇష్టంవచ్చిన పువ్వు పేరొకటి
ఇవ్వండంతే చాలును నాకు.

మీరనుకున్నది ఏమౌతుందో
మీ ఎదటే చెప్పేస్తానంటూ
జోస్యంపంతులు పిలకను చేత్తో
ఝాడించుకు ముడివేశాడు.

అయితే ప్రశ్నడిగా చెప్పండీ,
అవిసెపువ్వు పేరిచ్చానేను."
అన్నాడప్పుడు హనుమంతయ్య
అందరిమధ్యా నిలుచుని సత్యం.

'అవిసెపువ్వు' అని నోట్లో అనుకుని
అదేపనిగ ఆకాశం చూసి
అయిదువేళ్లనీ ముడిచీ తెరిచీ
"అవదయ్యా నీ ప్రశ్న"న్నాడు.

"నేన్నిన్నడిగిన దేమిటొ తెలుసా?
"నిజమవుతుందా నీ జోస్యం?" అని
నా ప్రశ్నకి నిజజాబు మాత్రం
నచ్చిందయ్యా" అన్నాడు.

పకాలుమని ప్రజలంతా నవ్వి
"తికమకపడకోయ్, జోస్యంపంతులు,
జోస్యంపంతులు కావయ్యా నువ్
ఝూటాపంతులి"వన్నారు!

అయితే నాకో సంశయ మున్నది
"అవద"ని చెప్పిన పంతులిజోస్యం
అబద్ధమా? నిజమా? చెప్పండి!
అంతా ఆలోచించండి!



# స్వర్గం సరదా తీరింది!


మరాఠీ మూలం: చి. వి. జోషి

అనువాదం: శ్రీమతి ఎన్. కమలకుమారి


ఎడారి అనే వూళ్లో బాగా వస్తీ వున్నచోట వాయి అనే వూరి కెళ్లే రోడ్డు హద్దు దగ్గర ఒక పెద్ద మఱ్ఱిచెట్టూ, ఆ చెట్టు కింద గచ్చు అరుగూ వున్నై. ఈ అరుక్కి కొంచెందూరంలో ఒంటి కమానుతో కట్టిన బ్రిడ్జివుంది. ఊళ్లోవాళ్లంతా అక్కడ కూర్చుని బాతాఖానీ కొడ్తూ కాలంగడుపుకునే జాగా అది. బ్రిడ్జి మీద కూర్చుని రోడ్డుమీద వెళ్లే కార్లు లెఖ్ఖపెట్టడం, లేకపోతే ఆ రాతి అరుగుమీద కూర్చుని అక్కడే చుట్టుప్రక్కల తిరుగుతూండే కోతుల లీలలు చూడడం, వీటితో ఆ చుట్టుప్రక్కలవాళ్లంతా కాలం గడుపుతూంటారు సాధారణంగా.

ఒకరోజున ఆ వూళ్లోనే వున్న మాదిగ మద్దిగాడు ఆ రాతి అరుగు మీద కొంచెం విచారంగా కూర్చున్నాడు. వాడు ఎప్పుడూ తన దుకాణంలోనే కూర్చుని పనిచేస్తూ, పది ఇరవయ్యేసి నిమిషాలకోసారి మూడుగుక్కాలమార్కు బీడీలు కాల్చడానికీ, ఆదేవిధంగా పొగాకు నమలడానికీ కాలం గడిపేస్తూండే వాడు. కాని ఆరోజున మాత్రం అరుగుమీద కూర్చుని రోడ్డుమీద వస్తూ పోతూండే మిలిటరీలారీలు లెఖ్ఖ పెట్టడంతప్ప మరేంపని లేక పోయింది. మద్దిగాడు ఏభైఏళ్ల పైబడ్డవాడిలాగా కన్పిస్తాడు. మనిషి తెల్లగా వున్నా మాసిపోయిన గుడ్డల మూ



 

# స్వర్గం సరదా తీరింది



లంగా కష్టజీవి అని మాత్రం స్పష్టంగా తెలుస్తుంది.

తెల్లటోపీలు పెట్టుకున్న ఇద్దరు వ్యక్తులు వేరుశనక్కాయలుతింటూ ఊళ్ళోంచి అరుగుదగ్గర కొచ్చారు. అందులో నల్లగా పొడుగ్గా వున్న మనిషి గాజులగవరయ్యా, పొట్టిగా తెల్లగావున్న రెండో వాడు మిషను కుట్టు వీరాస్వామి. వీళ్లిద్దరూ స్నేహితులే. ఇద్దరి వయస్సులు దగ్గరదగ్గరగా ముప్పైప్రైగా వుంటై. గవరయ్య తన చేతిలోవి రెండు వేరుశనక్కాయలు అరుగుమీద కూర్చున్న మద్దిగాడిచేతిలో పెట్టి, "ఏం మద్దిబాబాయ్, ఇయ్యాల ఈగలు తోలుకుంటూ అరుగుమీద కూకున్నావేం, అయ్యా!" అని అడిగాడు. "గాలి తింటా కూకున్నాడు" అన్నాడు వీరాస్వామి వెంటనే.

"గాలి కాకపోతే ఏం తినమంటవ్? పొద్దుటేళనిండీ ఈరొండు గింజలూ తప్ప పొట్టకింకేం లేదు. ఈ యాళ్లో నాయాపారం ఏం చాగేట్టు నేదు." అన్నాడు మద్దిగాడు దిగులుగా.

"యాపారం ఎట్టా చాగుద్ది? ఇప్పుడు ఈయూళ్లో పాతికిళ్ల వత్తీ కూడా నేందే? బడిమాట్టోరు మిలిటరీ కార్ఖానాలో గుమాస్తాపని సేస్తూండాడు. వూళ్లో పాతికమంది మిలటరీలోచేరి వూరు వదిలేశారు. పొలంలో పనిచేసే ఆడోళ్లు ఇంకో వూరు ఫ్యాక్టరీలో పనిసెయ్యడానికి బయలెల్లి పోయారు. ఇంక గాజులు మాత్రం యారికి తొడగాలి." అని తనబాధ చెప్పుకున్నాడు గాజుల గవరయ్య.

"నా యాపారం మాత్రం ఎక్కడ చాగుద్ది? బట్టలు నాలుగు రెట్లు ధర పెరిగింది. ఇంకెవరు బట్టలు కుట్టిత్తారు?" అని తన వ్యాపారం సంగతి చెప్పుకున్నాడు దర్జీ వీరాస్వామి.

ఇల్లా నిరాశగా వీళ్లు ముగ్గురూ మాట్లాడ్తూండగా ఇంకా ఇద్దరు అక్కడికి చేరారు. అందులో ఒకడు లావుగా వున్నాడు తలపాగా చుట్టుకుని వున్నాడు. వీడు మంగలి తిరుపతి అని వాడి చంకలో వున్న సంచీ, చేతిలో వెడల్పుగానూ పొడుగ్గానూ వున్న బట్టా ఇంకెవరూ చెప్పనవసరం లేకుండానే చెపుతున్నాయి. నెత్తిమీద తురకటోపీ, పొడుగాటి చొక్కా. దానిమీద జాకెట్టూ, పొడుగులాగూ, వేసుకున్న రెండో వాడు అబ్దుల్ కరీమ్‌భాయి చెష్మావాలాఅని చేతిలోవున్న రేకుపెట్టిని బట్టి ఎవరయినా తేలిగ్గా గ్రహించుకోవచ్చును. "పీబల్ కంపెనీ చెష్మా వాడితే ఎవరికయినా సరే చదవడం వస్తుంది" అని ఆపెట్టిమీద రంగులతో రాసివుంది.

"కరీమ్, నువ్వు మోసగాడివోయ్." అన్నాడు మద్దిగాడు కరీమ్‌ని ఉద్దేశిస్తూ.

"అదెల్లా బాబాయి?" అడిగాడు కరీమ్.

"నువ్వు సెప్పేవు. నీ చెష్మా వాడితే చదోడం వత్తదని. నీ చెష్మా కొనుక్కొని నేను వాడ్డం మొదలెట్టిందే చూదిలో దారంమాత్రం కన్పిస్తాది. మరి ఒక్క అచ్చరమయినా చదోడం వత్తేనే నచ్చినం తొట్టు" అని అమాయకంగా కంటిజోడు మహాత్వం తన అనుభవాన్ని బట్టి చెప్పాడు మాదిగమద్దిగాడు.

"బళ్లో సదవకోకుండానే ఎట్టా సదవడం వత్తుందోయ్? బాబాయ్! అట్టా జోడేసుకొంటేనే సదవడం వత్తే ఇంక బళ్లెందుకు, మాట్టార్లెందుకు? గవర్నమెంటు కళ్ళజోళ్ల దుకాణమే పెట్టేద్దురు." అన్నాడు తిరుపతి.

"పోనీలెద్దో, మరిమేము అడుగుతుండామా, తిరుపతిగా, నీ యాపారం ఎట్టాగుందోయ్" అని అడిగాడు మద్దిగాడు. తిరుపతి తన చేతిలోవున్న గుడ్డతో చెమట తుడుచుకుని, "యాపారం చాంతంగా పడిపోయింది చూడు! సదువుకునోళ్లు నలుగురూళ్లోన్నారు అంటే అళ్లకి నాలుగురోజులకోతూరి గడ్డం సెయ్యడం. ఇప్పుడు అళ్లంతా యుద్ధంలోకి పోయారు. మీరు పదేనురోజులకోతూరి గడ్డం గీయించుకుంటారాయె. మరి ఇంకేం యాపారంగట్టా వుంటది? ఈ భూమ్మీద ఏరియాపారం సాగదు" అన్నాడు.

ఇది విని గవరయ్య "భూమ్మీద యాపారం చాక్కపోతే కొడుకా, చ్వర్గంలో చాగుతుందేంటోయ్" అని అడిగాడు.

"ఔను. చ్వర్గంలో నాకు పని దొరికితే నేను అడకే పోడానికి ఒంటికాలుమీద తయ్యారు" అన్నాడు వీరాస్వామి.

ఇంతలో మఱ్ఱిచెట్టు వెనకాల నించి ఒక అదృశ్యవ్యక్తికంఠం

ఈ విధంగా వినిపించింది. "ఓ సాను. నడవండి స్వర్గానికి, మీకు కావలసినంత వ్యాపారం స్వర్గంలో సాగుతుంది. ఎవరికన్నా రావాలని వుంటే నేను నిమిషంలో తీస్కెళ్లి దిగబెడతాను."

ఇది విని అయిదుగురూ ఆశ్చర్యచకితులయ్యారు. అందరూ ఒక్కసారిగా, "ఏరా మాట్లాడేది" అని కేకేశారు. వెంటనే చెట్టువెనకాల వున్న వ్యక్తి ఒక్కసారిగా అందరికీ కన్పించింది. చిలకముక్కులాంటి పెద్దముక్కూ, రెండు పెద్ద పెద్ద రెక్కలూ, నెత్తిమీద కిరీటం వీటన్నిటినీ బట్టి విష్ణువాహనమనడానికేం సందేహం లేదు. ఆకారంలో మాత్రం చాలా పెద్దగా కన్పిస్తున్నాడు. హిందువులంతా సాష్టాంగ నమస్కారం చేశారు. తురకవాడు మాత్రంవంగివంగి సలాములు చేశాడు. గరుత్మంతుడు వీరితో సంభాషించడం మొదలుపెట్టాడు. "ప్రజలారా! స్వర్గంలో వ్యాపారం ఎల్లా సాగుతుందో మీకు చూడాలని వుందికనుక నడవండి, నేను మిమ్మల్ని పైకితీసుకెడతాను. మీకు బాగావుంటే అక్కడే వుండొచ్చును. లేకపోతే మర్నాడే మిమ్మల్ని తిరిగి తీసుకొని వస్తాను." అని చెప్పాడు.

అయిదుగురు మిత్రులూ గరుత్మంతుని ఆహ్వానానికి ఇష్టపడి స్వర్గానికి వెళ్లడానికివప్పుకున్నారు. మాదిగ మద్దిగాడు ఇంటికి పరుగెత్తికెళ్లి తనదగ్గరున్న చెప్పులూ, చెప్పులుకుట్టే సామగ్రీ మొదలయినవన్నీ మూటకట్టుకుని, తన పెళ్లాంతో ఏవో కల్పించి చెప్పి తిరిగివచ్చేశాడు అరుగుదగ్గరికి. గాజుల గవరయ్య గాజులపెట్టి తెచ్చాడు. దర్జీ వీరాస్వామి కత్తెరా టేపూ తీసుకున్నాడు. ఇదే విధంగా మిగతావారు వారివారి సామాన్లతో తయారయ్యారు. అంతా కలిసి గరుడుడి వీపుమీదకెక్కి కూర్చున్నారు. "కళ్లుమూసుకోండి. మూసుకున్నారా? హా! బాగుంది. తెరవండింక" అని గరుడుడు అంటూనే స్వర్గానికి చేర్చాడు వాళ్లందర్నీ. వాళ్లకి కూడా కళ్లు తెరవగానే స్వర్గానికి చేరినట్లనిపించింది. వాళ్లు వ్యాపారం చెయ్యడానికి రావడం వల్ల స్వర్గం చూడ్డం మానేసి వాళ్లవాళ్ల పనులు వెంటనే మొదలుపెట్టారు. రోడ్డుప్రక్కనున్న కాలిబాటమీద మద్దిగాడు తనచెప్పుల్ని పరుచుకుని కూర్చున్నాడు అమ్మడానికి. ఇంతట్లో ఏడుగుర్రాల రథం శరవేగంతో వచ్చి మద్దిగాడి ఎదురుగా ఆగింది ఒక్కసారిగా. ఎర్రరంగు అరుణుడు సారథిగా వుండి నడిపిస్తూండగా సూర్యదేవుడి రథం అతితేజోవంతంగా విరాజిల్లుతూంది. మద్దిగాడికళ్లు ఆ తేజానికి మిరుమిట్లు కొలిపినై. వెంటనే కరీమ్‌భాయి ఇచ్చిన చలవజోడు తీసి కళ్లకి తగిలించుకున్నాడు.

సూర్యదేవుడు సంజ్ఞచేసి మద్దిగాణ్ణి పిలవగానే, మద్దిగాడు తలపాగా సద్దుకుంటూ అతి వినయవిధేయతలతో చేతులు జోడించి దేవుడి ఎదురుగా నిలబడి, "భగవంతుడా! ఏంటో చలవిప్పించండి" అన్నాడు.

"మృత్యులోకం నించి క్రొత్తగా వచ్చినట్లున్నావు! బీడీ, పొగాకు వాసన ఇంకా నీదగ్గర వేస్తోంది. సరేలే. అదల్లా వుండనియ్యి. నా సారథికి మృత్యులోకంలో ఉపయోగించే బూట్ల జోడులాంటి జోడు కావాలి. ఏం తీస్కుంటావు ఒక జోడుకి?" అని సూర్యదేవుడు ఆజ్ఞాసూచకంగా అడిగాడు.

"దొరగారో! తమరిష్టం వచ్చింది ఇప్పించండి. తమదగ్గర నేను బేరం వేంసేత్తానండీ" అన్నాడు మద్దిగాడు ఎంతో వినయంగా.

"చూడు మద్దిగా, ఇది స్వర్గం. ఇక్కడ మనుష్యలోకంలో మాదిరిగా బేరాలు సాగవు. ఒక్కటే బేరం. ఇదే ఇక్కడిపద్ధతి." అని నిక్కచ్చిగా చెప్పేశాడు దేవుడు.

"భగమంతులు, పదిరూపాయలిప్పించండి. ఎంత పెద్దకాలయినా ఇంక తిరుగు మాటుండదండి బాబూ" అన్నాడు మద్దిగాడు.

సూర్యనారాయణ వాడిని సారథి కాలికొలతలు తీసుకోమన్నాడు. మద్దిగాడు సారథికాళ్ల కోసం చూడడం మొదలెట్టాడు కాని అరుణుడికి కాళ్లెక్కడున్నాయి? తొడలు మాత్రం వున్నై - అంటే తలదగ్గర్నించి చూస్తే. ఈ హాస్యం మద్దిగాడికేం నచ్చలేదు. తన నోట్లో దుమ్ముపడడానికి ఇది ఒక సాకు అనుకున్నాడు. కాని సూర్యుడు బాహ్యంగా ఎంత వేడిగావున్నాడో, అంతర్యంగా అంత దయగలవాడిలాగా కన్పిస్తున్నాడు. ఆయన నవ్వి, "మాదిగన్నా, నేను నీతో పరిహాసమాడాను. మా అరుణుడికి ఏ రకమయిన పాదరక్షలూ అవసరం లేదు. ఇదుగో నీ పదిరూపాయలూ.



# స్వర్గం సరదా తీరింది



అరుణా! పదు, రథాన్ని నందన వనంవైపుకి పోనియ్యి" అన్నాడు.

మద్దిగాడిచేతిలో పదినాణాలూ పడ్డాయి. రథం శరవేగంతో పరుగెత్తసాగింది. నాణాల మీద ఇంద్రుడి ముఖచిత్రం ముద్రింపబడి వుంది. ఇంకా బహ్మసంవత్సర అంకెలూ, ఇంకా ఏవో సంస్కృత అక్షరాలూ వున్నాయి. మద్దిగాడికి చదవడం చాత కాకపోవడంవల్ల ఇంద్రుడిబొమ్మమాత్రం చూశాడు.

కాస్సేపయ్యాక మంగలి తిరుపతిగాడు తన గుడ్డతో విసురుకుంటూ మద్దిగాడిదగ్గర కొచ్చాడు పుగాకు నమలడానికి. స్వర్గంలో పుగాకు దొరకదు. మూడుజాతుల వృక్షాలుమాత్రం వున్నయి—మొదటిది పారిజాతం, రెండోది మందారం మూడోది కల్పవృక్షం. మనుష్యలోకంనించి బయల్దేరే ముందు సంచిలో వేసుకున్న పుగాకులో మిగిలిన ఒక పుగాకు కాడని రెండుముక్కలు చేసి దాని కింకా సున్నంరాసి దాన్ని నవుల్తూ తిరుపతి "బాబాయ్ ఇయ్యాల ఏం దొరికింది?" అని అడిగాడు మద్దిగాడిని.

"ఇదుగో చూడు పదిరూపాయలు. ఇద్దైనా వూరికే దొరికింది సూర్యనారాయుడి దయ" అన్నాడు రూపాయలు గల గల లాడిస్తూ.

తనకికూడా ఒక గిరాయికీ తగుల్తుందనే ఆశతో తిరుపతి పొగాకు నవుల్తూ తన దుకాణంలోకి వెళ్ళాడు. ఈ దుకాణం గరుడుడు తనకి ఏర్పాటుచేసినది. దుకాణంగోడమీద తిరుపతిగాడు తనుచేసేపనికి ధరలు రాసిపెట్టాడు

"తలమీద జుట్టు కత్తిరించడానికి ...ప్రతి దేవుడికీ నాలు గణాలు. నున్నగా గుండు చెయ్యడానికి... ప్రతి దేవతకీ రెండు అణాలు.

గడ్డం చెయ్యడానికీ అంతే."

తిరుపతి తన గుడ్డతో జాగా తుడుస్తోండగా ఒక గిరాయికీ లోపలికివచ్చాడు. ఆ వచ్చిన వాడు సామాన్యంగా లేడు. ప్రత్యక్ష చతుర్ముఖ బ్రహ్మదేవుడు ఆ వచ్చినది. తన గడ్డాలలో ఒకగడ్డం ఉంగరాలు తిప్పుతూ, "దుకాణం క్రొత్తదిగా కన్పిస్తోంది. ఏదీ చూద్దాం, నీచెయ్యి ఎల్లా పని చేస్తుందో" అన్నాడు.

"కూసోండి! కూసోండి! బ్రహ్మదేవా! నాచెయ్యి ఎట్టాపనిసేస్తదో సూడండి దయుంచి. బెండూరి మా రాజులదగ్గర నేను పనిసేస్తాండోణ్ణి బాబూ. ఆడ ఇసుగుపుట్టి ఈ సర్గంలో యాపారం సేద్దామని వచ్చాను"అన్నాడు తిరుపతి.

బ్రహ్మదేవుడి నాలుగు తలలకీ నాలుగు గడ్డాలకీ క్షురకర్మ చేసేసరికి తిరుపతి చెయ్యి లాక్కొచ్చింది. తన గిరాయికీతో కాస్త ఏమన్నా మాట్లాడ్తూ కాలం గడుపుకుందా మనుకున్నాడే కాని బ్రహ్మదేవుడి నాలుగునోళ్లూ అంతమాత్రం అవకాశం ఇవ్వలేదు తిరుపతికి. పని అంతా అయ్యాక బ్రహ్మదేవుడు ఆరు అణాలు వాడిచేతిలో వేశాడు. వెంటనే తిరుపతి, నాలుగు తలకాయలకీ ఒక రూపాయీ, నాలుగు గడ్డాలకీ అర్ధరూపాయీ తమరు నాకు దయసేయించాలండి" అన్నాడు.

"నువ్వు ఏంధర పెట్టావో సరిగ్గా చదువు; జుట్టు కత్తిరింపుకి దేవుడికి నాలుగణాలూ, గడ్డానికి రెండు అణాలూ; నే నొక్కణ్ణేగా దేవుణ్ణి?" అని అడిగాడు బ్రహ్మదేవుడు.

తను ధరలు రాయడంలో పొరబాటు చేశాననుకున్నాడు మంగలి. మృత్యులోకంలో ప్రతివాడికీ ఒక్కతలే వుంటుంది; కాని స్వర్గలోకంలో చాలా తలలుంటాయనే సంగతి తను ముందుగా ఆలోచించలేదు. బ్రహ్మదేవుడు తనని బాగా పరాభవించాడనుకున్నాడు.

కమలాసనంమీద కూర్చుని వేదపఠనం చేస్తున్న బ్రహ్మదేవుణ్ణి చూసి "ఏం తాతయ్యా, ఎల్లావున్నావు? మంగలి దొరికినట్టున్నాడు, గడ్డం మాంఛి నున్నగా కన్పిస్తోంది." అని అడిగాడు రావణుడు.

"దొరికాడు బాబూ ఒక్కసారి. మృత్యులోకంలోంచి వచ్చాడెవడో వ్యాపారం చెయ్యడానికి. పైగా ఒక్కొక్కడికి నాలుగణాలే. గడ్డానికి మాత్రం రెండణాలు. నువ్వుకూడా వెళ్లి క్షవరం చేయించుకునిరా తుర్థింగా." అని బ్రహ్మదేవుడు సలహా

చెప్పాడు. రావణుడు దుష్టరాక్షసుడయినా రాముడి చేతిలో మృత్యువురాబట్టి, స్వర్గప్రాప్తి కలిగినదని అందరికీ తెలిసిన సంగతే. స్వర్గంలో ఏ మంగలివాడూ కూడా రావణుడికి క్షురం చెయ్యడానికి ఒప్పుకోక పోవడంవల్ల రావణుడికి పెద్ద తంటాయే వచ్చిపడింది. ఒక్క మనిషికి క్షురం చెయ్యాలంటే పర్వాలేదు కాని ఒక్కొక్కడికి పదేసి తలకాయలుంటే క్షురం చెయ్యడమనేది పెద్ద సమస్యే. లంకలో అయితే తను రాజు కనక తన ఇష్టానుసారంగా ఏం చెయ్యాలన్నా సాగింది. మరి స్వర్గంలో తను సామాన్య పౌరుడు. ఏం సాగుతుంది? హిందూస్థానంలో ఏనుగుమీదినించి దిగి ఎనిమిది గుర్రాల రథం మీద స్వారీచేసే మైసూరు మహారాజా ఇంగ్లాండు వెళ్లాక తనపెట్టే బేడా తనే మోసుకుని వెళ్ళవలసి వచ్చినట్లుగా రావణుడు స్వర్గంలో సామాన్యగృహస్థుడిలాగా కాలం గడపవలసి వస్తోంది పాపం! క్రొత్తగా స్వర్గానికి వచ్చిన మనమంగలి తిరుపతిని పరాభవించడానికి రావణుడు షణ్ముఖ కార్తికేయుణ్ణి దత్తాత్రేయుణ్ణీకూడా తీసుకుని తిరుపతి దుకాణంలో ప్రవేశించాడు. రావణుడి పది తలకాయలూ, కార్తికేయుడి ఆరు తలలూ, దత్తాత్రేయుడి మూడు తలలూ చూసేసరికి తిరుపతికి పైప్రాణాలు పైకి ఎగిరిపోయినై. దుకాణంగుమ్మంలో కూర్చున్న కరీమ్‌భాయి చెవిలో ఏదో చెప్పి తను క్షురం చెయ్యడం మొదలెట్టాడు ఒక్కొక్క తలకాయికే. మొత్తం పందొమ్మిది తలలూ, పందొమ్మిది గడ్డాలూ పూర్తిఅయినై. రావణుడు మొత్తం లెఖ్ఖ చూసి రూపాయిబేడ తిరుపతి చేతిలో పెట్టాడు.

ఇది చూసి తిరుపతి "లంకా ప్రభువులు. ఏదైనా ఆలోచించి డబ్బు ఇప్పించండి" అని విన్నవించుకున్నాడు.

"ఒరేయి. ముగ్గురిదేవుళ్ళ తలలకీ పన్నెండణాలూ, గడ్డాలకి ఆరణాలూ మొత్తం ఎంతయిందిరా" అన్నాడు రావణుడు.

"మా ధరలు మారాజులు చదవాలి" అన్నాడు తిరుపతి.

ఈలోపుగా కరీమ్‌భాయి మొదటిధరలు చెరిపేసి క్రొత్తధరలు బొగ్గుతో రాసి పెట్టాడు—

ఒక్కొక్క తలకాయికి క్షురం చేసినందుకు రూ. 0.4.0. ఒక్కొక్క గడ్డానికి క్షురం చేసినందుకు రూ. 0.2.0.

రావణుడు ఈధరలు చూసేసరికి ఒక్కసారిగా కూలబడ్డాడు. ప్రతివ్యక్తికీ అని కాకుండా ప్రతి తలకీ, గడ్డానికీ ప్రత్యేకంగా ధరలు రాయబడ్డాయి. ఇంకచేసేదేం లేక మొత్తం ఏడురూపాయల రెండు అణాలూ అర్పించుకుని ఆముగ్గురుదేవుళ్లూ వెళ్లిపోయారు.

*   *   *

గాజుల గవరయ్య ఒకచేతిబండి అద్దెకి తీసుకున్నాడు. అందులో గాజులు చక్కగా అమర్చి గిరాకీలకోసం ఎదురు చూస్తూ కూర్చున్నాడు. మరోవైపునించి ఒకడు "అమృతం కావాలా అమృతం" అంటూ అమృతం అమ్ముతూ అక్కడికి వచ్చాడు. గవరయ్య జేబులో ఒకపావలా వుంది. అదిపెట్టి ఒక బంగారపుదొప్పెడు అమృతం కొనుక్కుని త్రాగుతూ "అబ్బే, దీనికి మా మనుష్యలోకంలో దొరికే 'టీ' రుచే లేదు!" అన్నాడు. ఈవిధమయిన మూర్ఖపు మాటలు స్వర్గంలో కూడా వాడకుండా వుండలేకపోయాడు. స్వర్గంలో స్త్రీలంటే అప్సరసలు. వాళ్లు బంగారం, రేడియం, ప్లాటినం మొదలయిన విలువగల వాటితో చేసిన గాజులే కాని వాడరు. మృత్యులోకంలో చేసిన గాజుగాజులు వాళ్లకి ఎల్లా నచ్చుతాయి? అక్కడికి వచ్చిన అప్సరసలు ముక్కు నలుపుకుని ముందుకు వెళ్లడం ప్రారంభించారు. గవరయ్య ఇది భరించలేకపోయాడు. ఆ ముక్కులు నలుపుకోవడం చూసేసరికి మన గవరయ్యకి ఎంత కోపం వచ్చిందంటే ఈ స్వర్గంలో వుండే ఆడవాళ్లందరి ముక్కులూ తెగ్గోసి పారెయ్యాలనిపించింది. నామాలు కట్టుకుని, ఒక చేతిలో తంబూరా, ఇంకో చేతిలో నాసికాగడా పట్టుకున్న ఒక భృత్యుడు గవరయ్యదగ్గరకొచ్చి, "అంబాబాయి ఘంకా! ఏం గాజుల గవరయ్యా! కొత్తగా వచ్చినట్లున్నావు స్వర్గానికి! నేను గోకారం గోవిందయ్యని. పుణ్యం చెయ్యబట్టి చచ్చాక ఇక్కడకొచ్చాను. ఇదుగో చూడు. మా అమ్మగారికి మంచి రకం గాజులు కావాలి. ఒక్కొక్క చేతికి కావలసిన గాజులు వెయ్యాలి. ఏం తీసుకుంటావు?" అని అడిగాడు గవరయ్యని.

ఒక్కొక్క గాజుకి రెండణాలు అవుతుందని గవరయ్యనుకున్నాడు. వాళ్లమ్మగారికి రెండు చేతులుంటై; రెండు చేతులకీ రెండు గాజులూ, వాటి ఖరీదు నాలుగణాలూ. అంతా లెఖ్ఖకట్టుకుని ఆ భృత్యుడు కొంచెం అమాయకంగా కన్పిస్తూండడంవల్ల అర్ధరూపాయి చెప్పినా ఫర్వాలేదనుకుని అర్ధరూపాయవుతుందని చెప్పాడు. దీనికి ఒప్పుకొని ఆ భృత్యుడు గవరయ్యని ఇంటికి తీసుకెళ్లాడు. మొదట ఆ దేవి విక్రుతాకారం చూడగానే గవరయ్య భయపడ్డాడు. దేవత తనకి అభయహస్త మియ్యగానే తెప్పరిల్లాడు. "వత్సా! భయపడకు. నేను జన్మదాతని. మంచి వాళ్లకి కష్టాలు కల్పించను. ఈ చేతికి ఒక గాజు తొడుగు" అంటూ వంటిమీద కప్పుకున్న ఒక విలువైన శాలువాలోంచి తన కుడిచెయ్యి బయటికి జాపింది. ఒక చక్కటి గాజు తీసి తొడిగి గవరయ్య ఎడంచెయ్యి కోసం అడిగాడు. దేవి ఎడంచెయ్యి అందించగానే దానికూడా ఒక గాజు తొడిగి తను మొదట చెప్పిన అర్ధరూపాయి అడిగాడు.

"ప్రతి చేతికీ ఒక్కొక్క గాజు తొడగడానికి ఒప్పుకున్నావుకదా! మరి ఈ చేతికి ఎక్కడ తొడిగావ్?" అంటూ ఇంకో కుడిచెయ్యి బయటికి జాపింది.

ఈ మూడో చెయ్యి చూసేసరికి గవరయ్యకి భయం పుట్టింది. తను స్వర్గంలో వున్నానని తర్వాత జ్ఞాపకం వచ్చింది. ఇక్కడ భూతాలుండడం అసంభవమని ధైర్యం తెచ్చుకుని ఆ చేతికి కూడా ఒక గాజు వేశాడు.

మూడో చెయ్యికి తొడగ్గానే నాలుగో చెయ్యి బయటికి జాపింది ఆ దేవి. ఈ విధంగా ఎనిమిది చేతులూ బయటికి తీసి ఎనిమిది గాజులూ తొడిగించుకుందావిడ. ఆమె అష్టభుజదేవత. ఎనిమిది చేతుల గాజులకీ ఎనిమిదణాలూ తీసుకుని మాట్లాడకుండా ఆవిడకి సాష్టాంగ నమస్కారంచేసి గవరయ్య ఆవిడమందిరం నించి పరిగెత్తుకెళ్ళాడు. ఈ వ్యవహారంలో తనకి నష్టమయినా, ప్రాణరక్షణకు చాలా ఆనందించి మనస్సుకి ఆట్టే బాధలేకుండా చేసుకున్నాడు.

పీరాసాహెబ్ ఒకదుకాణం అద్దెకి తీసుకున్నాడు. అతను చొక్కాలు కుట్టడంలో బహు నేర్పరి. ఎడారిలాంటి పూళ్ళో కోటూ లాగూ ఎవరు కుట్టించుకుంటారు? తెల్లగుడ్డ ఒకటి దగ్గర వుంచుకుని దుకాణంమీద "భూలోకంలోంచి వచ్చిన అతి నేర్పరి మిషనుకుట్టు పీరాసాహెబ్: గుడ్డతో సహితముగా మూడు రూపాయలలో చొక్కా కుట్టి ఇచ్చును" అని రాసివున్న బోర్డు కట్టివుంచాడు. తల మీద కిరీటం, మెలికలు తిరిగిన మీసాలూ, నడుంకి పట్టుబట్ట కట్టుకున్న ఒక మంచి బలమైన వస్తాదు చేతులు లోపల ముడుచుకుని, పైన శాలువా కప్పుకుని పీరాసాహెబ్‌దగ్గర కొచ్చి, "జై, ఇంద్ర! ఏం పీరాసాబ్! మూడు రూపాయలలో గుడ్డతోసహా చొక్కా కుట్టిస్తానంటున్నావు? మేమెక్కడ ఇవ్వద్దన్నాం? నాకు రెండు చొక్కాలు ఆరు రూపాయల్లో కుట్టిస్తావా?" అని అడిగాడు.

"ఆ. ఆ. తప్పకుండా కుట్టిస్తాను,



పిల్లల దసరాసంచిక (6-10-54) లో 'కాగితపు పడవలు' అనే బొమ్మకు బహుమతిపొందిన జల్లేపల్లి వీరభద్రశర్మ—విజయనగరం.



అదే సంచికలో "ఊరికి" అనే బొమ్మకు బహుమతిపొందిన మంత్రిప్రగడ సీతారాం—నెల్లూరు.



# స్వర్గం సరదాతీరింది!



ఒక్కసారి పరీక్షించుకుని చూడండి" అన్నాడు టోపు చేతులలో జరుపుకుంటూ వీరాస్వామి.

"సరే. కొలతలు తీసుకో." కాలువా తియ్యకుండానే చెప్పాడు ఆ వస్త్రాదు దేవుడు.

వీరాస్వామి కాలువామీదనించే కొలతలు తీసుకుని, "దేవా! కొత్తచాలువా కత్తిరించండి. చేతుల కొలతలు తీసుకోవాలి. పెద్ద చేతులాండి? సగం చేతులాండి?" అని అడిగాడు.

ఆ దేవుడు తన వంటిమీదున్న కాలువా తియ్యగానే ఆయనకున్న వెయ్యిచేతులూ చూసేసరికి మన వీరాస్వామికి మూర్ఛ వచ్చింది. దేవుడు తక్కువవాడేం కాదు. కార్తవీర్య సహస్రార్జునుడు. వీరాస్వామి మూర్ఛిల్లడం చూసి దగ్గరేవున్న అమృతాశ్రమం నించి ఒక కప్పు అమృతం తెప్పించి వీరాస్వామి కళ్ళకి రాశాడు. వీరాస్వామి కాస్సేపటికి తెప్పిరిల్లి "ఎనిమిదిరోజు లయ్యాక చొక్కా తీస్కెళ్ళండి" అని చెప్పాడు. ఎనిమిదిరోజుల లోపుగానే మూటా ముల్లే కట్టుకుని అక్కడినించి పారిపోవాలని వీరాస్వామి స్థిరనిశ్చయం చేసుకున్నాడు.

కరీమ్‌భాయి స్కెచ్ చేతిలో పట్టుకుని వచ్చే పోయే దేవుళ్ళ నేత్రాలవంక చూస్తూ తిరుగుతున్నాడు. ఒక తక్కువ రకం దేవుడు కరీమ్‌ని చూసి "క్యామియా, చెష్మ బేచ్‌నేక్కా హై?" అన్నాడు.

తక్కువరకం దేవుళ్లని విశేషంగా కనిపెట్టాలంటే ఉచ్ఛదశల్లో వుండే దేవుళ్ళ మొహాలు చాలా తేజోవంతంగా వుంటై. అంతేకాక వాళ్ళకి అసామాన్య అవయవాలుంటై. కొంతమందికి మూడుకళ్లూ, కొంతమందికి నాలుగుచేతులూ, మరి కొంతమందికి నాలుగుతలలూ, ఇంకా కొంతమందికి ఏనుగుతలకాయలూ ఇవన్నీ వారి లక్షణాలు. తక్కువరకం దేవుళ్లు సర్వసాధారణంగా వుంటారు. వాళ్ళకి బట్టలుకూడా ఆట్టేవుండవు. కాదంటే పట్టుపీతాంబరాలు ధరిస్తారు. కరీంభాయి ఆ దేవుడుతో "హా! హా! దేవజీ! దేవేక్ నహీఁతో క్యాఖానే కో హై? అస్సలయిన పేబల్ కంపెనీని చలవకళ్లజోళ్లు" అన్నాడు.

"మా దేవుడికి చలవజోడు కావాలి. మనుష్యలోకంలోకన్నా ఇక్కడ ఎండెక్కువ" అన్నాడు దేవుడు.

"అదేంటి బాబూ?"

"స్వర్గం సూర్యుడికి చాలాదగ్గర కాదూ మరి! అందుకనే ఇక్కడ ఎండెక్కువ. సరేకానీ మా దేవుడికి ఒక్కొక్క కంటికి ఒక్కొక్క అద్దం కావాలి. ఏం ఇమ్మంటావో చెప్పు?" అడిగాడు దేవుడు.

కరీంభాయి హిందువులలో చాలా రోజుల నించి మెలగడం వల్ల కొంతమంది దేవుళ్ళనిగురించి తెలుసును. రావణుడికి పది తలకాయలూ ఇరవైకళ్లూ వున్నయి కనుక ఎన్ని తలకాయలుంటే అంతకు రెట్టింపు కళ్లు వుండవచ్చుననుకుని "మీ దేవుడికి ఎన్ని తలలున్నయ్యా"ని అడిగాడు.

తమ దేవుడికి ఒక్కటే తలకాయని ఆ దేవుడు చెప్పినందువల్ల మహా వుంటే రెండు కళ్లుంటయ్యనుకున్నాడు. బహుశా మద్దిగాడికి సూర్యదేవుడు కాళ్ళులేనివాడికి బూట్లుకావాలని చెప్పి ఊరికనే పదిరూపాయలు ఇచ్చినట్టుగా తనకూడా ఏ గ్రుడ్డి దేవుడికో లేక ఏ ఏకాక్షి దేవుడికో కళ్ళ

కోడిమ్మని అడిగి తనకికూడా ఓ పది రూపాయలు ఈదేవుడు ఇవ్వవచ్చునని లోలోపల సంబరపడి, "మీ దేవుడి ప్రతి కంటికీ ఒక్కొక్క అద్దం ఇస్తాను. నాకో పదిరూపాయలిస్తే చాల"న్నాడు కరీం భాయి.

ఈ బేరానికి ఆ దేవుడు ఒప్పుకుని కరీం భాయిని స్వర్గంలో వున్న రాజవాడాలోకి తీసుకెళ్ళాడు. తిన్నగా తీసుకెళ్ళి ఇంద్రుడి ఎదురుగా నిలబెట్టాడు. ఇంద్రుడి శరీరమే ఒక అద్దాలమందిరం: తలమొదలు పాదం దాకా నేత్రాలే. సహస్రాక్షుడు అనే పేరు ఇంద్రుడికుందని అందరికీ తెలిసే వుండొచ్చు బహుశా. కరీంభాయి పెట్టెలో ఒక్క ఎనభై అద్దాలు మాత్రం వున్నాయి. అవన్నీ ఇంద్రుడు తీసుకుని ఖాళీ పెట్టె కరీం మీదికి విసిరి, "ఏవయ్యో భాయీ! మిగతా తొమ్మిదివందల ఇరవై అద్దాలు తెచ్చియిచ్చి నీ పదిరూపాయలూ తీసుకుపో. దేవుళ్ళని మోసంచేసి స్వర్గలోకంలో బాగా లాభం తీద్దామనుకున్నావా" అన్నాడు.

ఆ సాయంత్రమే అనుకున్న ప్రకారంగా అయిదుగురు మిత్రులూ నందనవనానికి షికారువెళ్ళారు. ముద్దిగాడి జేబులో మాత్రం పదిరూపాయలు గలగల్లాడుతున్నాయి. మిగతా నలుగురూ మొహాలు వేళ్ళాడేసుకుని కూర్చున్నారు. మంగలి తిరపతికికూడా పాపం చాలా తక్కువ దొరికింది. ముద్దిగాణ్ణి చూసి కరీంభాయి "బాబాయ్! నా జేబు ఇవ్వాళ పూర్తిగా ఖాళీ అయిపోయింది. నమల్దానికి కాసంతపొగాకు ముక్కెట్టు" అనిఅడిగాడు. గవరయ్య తిరపతిగాణ్ణి చూసి "తిరపతిగా, నా గొంతారిపోయింది. ఒక పావు కప్పు టీ పోయిద్దూ నీ స్నేహితుడికి" అని అడిగాడు.

స్వర్గంలో పుగాకూ, టీ, మసాలా శనగలూ ఇల్లాంటివి అమ్మేదుకాణాలేంలేవు సరికదా చివరికి కిళ్ళీలు కూడా దొరకవు. చంటిపిల్లలకి దాహమేసినా పాలూ, ఆకలేసినా పాలూలాగే స్వర్గంలో ఆకలీ, దాహం ఇంకా ఇల్లాంటి బాధలకి అమృతం ఒక్కటే ఉపాయం. అమృతం అజీర్ణంచేసి ఒకవేళ ఏ దేవుడికన్నా అకాలమృత్యువు ప్రాప్తించిందంటే తిరిగి అమృతంతోనే బ్రతికిస్తారు. చివరికి ఈ అమృతంమీద విరక్తిపుడితే మృత్యులోకం వుంది అక్కడ అవతరించడానికి.

చివరికి స్వర్గంకన్నా మన ఎడారిపూరే ఎంతో బాగుంటుందనే నిశ్చయానికివచ్చారు మన ఎడారిపూరిఅయిదుగురు ఆప్తమిత్రులూ. స్వర్గంలో పులుకూ పులుకూ అంటూ తొంగిచూసేఆకాశగంగకంటేఎడారిపూరిదగ్గరున్న చెరువు ఎంతహాయిగావుంటుంది చూడ్డానికి! ఈ వికారపెట్టే అమృతంకంటె మనచోడిగంజీ, మనపుల్లయ్యకొట్లో అమ్మే పుణుకులూ, సుబ్బారావుహోటల్లో ఇచ్చే మట్టిరంగుటీ! అబ్బ! ఎంత బాగుంటై! తల్చుకుంటే నోరూరుతుంది. స్వర్గంలో ఏమిటి! నేలంతా బంగారం; గోడలన్నీ బంగారం; చివరికి మెడలో వేసుకునే నగలుకూడా బంగారానివే! మనుష్యలోకంలో ఎన్ని రకాలో ఖనిజాలు దొరుకుతాయి! ఇంక ఎడారిపూరు పోతేనే బాగుంటుంది. ఏం సుఖంవుంది ఇక్కడ?

స్వర్గంలోవున్న నందనవనంలో దేవుళ్లు ఆడుకుంటారు. అంటే అక్కడో క్రీడారంగం వుంది. బయట తమతమ వాహనాలు ఆపి దేవుళ్ళంతా లోపల ఆడుకుంటున్నారు మనవాళ్లు అక్కడికి వెళ్లేసరికి. పుష్పకవిమానం, వైజయంతరథం, నెమిలీ, ఎలుకా, నందీ, ఐరావతీ, గరుడుడూ మొదలయిన వాహనాలు అమృతం గుటకలువేస్తూ తమతమ దేవుళ్ళ కథలు చెప్పుకుంటూ కాలక్షేపం చేస్తున్నారు. మిత్రులంతా గరుడుడి దగ్గరకెళ్ళి, "దేవా! గరుత్మంతుడా! ఒక్క రోజులోనే మాకీస్వర్గవాసం విసుగొచ్చింది. ఇంకచాలు. మావూళ్లో ఏందొరికితే అదే తిని బ్రతుకుతాం కాని మమ్మల్ని తీసుకెళ్ళి దిగబెట్ట"మని వేడుకున్నారు.

"తీరిందా స్వర్గం సరదా! సరే నడవండి ఇంటికింక" అంటూ గరుత్మంతుడు వీళ్ళందర్నీ వీపుమీద ఎక్కించుకుని క్షణంలో ఎడారిపూరి మర్రిచెట్టుక్రిందున్న గట్టుఅరుగు దగ్గర దిగబెట్టి తను అదృశ్యుడయ్యాడు.

జరిగినదంతా ఎవరికన్నా చెప్తే వాళ్లు తమని పిచ్చివాళ్ళక్రిందకట్టి హేళనచేస్తారనే భయంవల్ల ఇందులో ఎవరూకూడా ఎవ్వరిదగ్గరా ఏం చెప్పకుండా ఎల్లావున్నవాళ్లు అల్లాగేకూర్చున్నారు మెదలకుండా.



"నేను, మాసంగీతం మేష్టారు" చిత్రానికి
దసరా బహుమతి పొందిన

పెద్దకథ:

# వాసు చదువు

(గతసంచిక తరువాయి)

## 7

రోజులు గడుస్తున్నయ్. వాసు కనీసం నెలకోసారైనా, స్వగ్రామం వస్తూపోతుండే వాడు. సాయం కాలం తిరగటం తప్పిస్తే ఆటన్నది యెరగడు. ఆటల్లో యెన్నితగవు లొస్తున్నాయో ప్రత్యక్షంగా చూస్తున్నందువల్ల ఆడాలన్న బుద్ధే కలగటం లేదు. కామేశం, విశ్వం మాత్రం ప్రతిరోజు బంతాట ఆడు కునివచ్చి యేఆటాచేతకాని వాసుని చూచి నవ్వేవారు. సమయం వస్తే యెగతాళి చేసేవారు కూడా. వాసు యివేమీ పట్టించుకోకండా వూరుకునే వాడు.

మునుదుంకొట్టు హనుమంతరావు

వాసు తనకి తెలిని విషయాలు క్రిష్ణారావు మాష్టరు నడిగి తెలుసు కుండేవాడు. తన తమ్ముడు కొడు కులకీ అలవాటు, శ్రద్ధలేకపోయినా కనీసం వాసు కున్నందుకు అత న్నెంతో అభినందించి, అడిగిన వన్నీ విపులంగా చెప్పేవాడు క్రిష్ణా రావు మాష్టరు. రాను రాను వాసుపై అవ్యాజమైన ప్రేమపుట్టు కొచ్చిందతనికి.

పరీక్షలు ప్రారంభించారు. వాసు ఒక్క నిమిషం కూడా వృథాగా పోనివ్వకండా యేదో ఒకాటి రాస్తూ, చదువుతూ వుండే వాడు. కామేశం కొన్ని నియమ మైన సమయాల్లోనే చదివే వాడు. వాసుయింతశ్రద్ధగా చదవటం సీతా లక్ష్మికి వుడుకుమోత్తనమన్పించింది. కాని యేంచేస్తుంది? ఈ కోపమంతా తన కొడుకులపై రుద్దేది.

పరీక్షలయ్యాయ్ - ఫలితాలు తెలిసినయ్. వాసు క్లాసులో ఫస్టుగా పాసయ్యాడు. వాసు లాంటివిద్యార్థి తనక్లాసులో వున్నందుకు క్లాసుమాష్టరు గర్వించాడు. ముఖ్యంగా క్రిష్ణారావు మాష్టరు ఉప్పొంగి పోయాడు. వాసు పునాది దృఢతరమైందని అతను ఊహించాడు. వాసుపై అభిమానం మరింత హెచ్చయ్యింది. సూర్యనారాయణ దంపతుల ఆనం దానికి మేరలేక పోయింది. వారి కింతకంటె కావల్సిందేవిటి? తను వాసుని తెచ్చినందుకు మర్యాద దక్కిందనుకుంది వరహాలు.

ఇంతకూ అసూయ పడిందల్లా ఒక్క సీతాలక్ష్మే. తనకొడుకుల కెందుకలా మార్కులు రాకూ



అక్షరాభ్యాసం   చిత్రకారుడు: కలపటపు వేణుగోపాల్, బందరు.

డదు? అన్న అభిమానం ఆమెకుంది. కాని దీనికి వాసు యెంతవరకు బాధ్యుడో ఆమె ఆలోచించ లేదు. వాసునేం అనలేక వ్యంగ్యంగా కామేశాన్ని వుద్రేకంతో నాలుగు తిట్టింది. కామేశాన్ని యెందుకలా తిట్టిందో అర్థంచేసుకోలేక బిక్క మొహం వేశాడు వాసు.

కామేశంకి తెలుసు - తల్లి తన నెందుకు తిట్టిందో! అతడికి కూడా వాసుపై అసహ్యం పుట్టి అసూయ పెరిగింది. విశ్వం యివన్నీ హృదయంలో వుంచుకోకుండా మామూలుగా తిరుగుతుండే వాడు.

ఇప్పుడు సెకెండు ఫారంలోకి వచ్చాడు వాసు. కామేశం థర్డు ఫారం చదువుతున్నాడు. ఒకక్లాసు యెక్కువైనా, వాసుకున్న పాటి లోకజ్ఞానం, తెలివితేటలు కామేశంలో సున్నా. అతనిలో జీర్ణించుకున్న గొప్ప విద్య అసూయ ద్వేషాలు.

వాసు సెకెండు ఫారంకి వచ్చిం తరవాత- మొదట్నుంచీ యిష్టం లేని సీతాలక్ష్మి చిన్న చూపు చూడ్డం మొదలు పెట్టింది. ఎన్నో విషయాల్లో సీతాలక్ష్మి పక్షపాతం చూపుతూండటం గమనించాడు వాసు. కాని ఆ విషయం యెవరికీ తెలీనివ్వ లేదు. రోజుకిరోజు వాసుకి ప్రపంచజ్ఞానం అధికమౌతున్న కొద్దీ తననుభవిస్తున్న కష్టసుఖాలు అర్థమౌతున్నయ్. ముందు ఆప్తుడు, స్నేహితుడనుకున్న విశ్వం కూడా యిప్పుడు వాసుని తప్పించుకుని తిరుగుతూండటం ఆశ్చర్యమైన విషయం. అందుక్కారణం బహుశా వాసు విశ్వాన్ని చదువు కోమని బోధపర్చటమే అయి వుండొచ్చు. విశ్వం కూడా దూరమౌతున్నందుకు బాధపడ్డాడు వాసు. ఎక్కడికి పోయినా ఒంటరిగా వెళ్ళటం మరీ కష్ట మన్పించింది... మరో మార్గం యేదీ అగుపించ లేదు. ఏటిఒడ్డుకుపోయి కాస్సేపు సాయంకాలాల్లో కూర్చుంటూండే వాడు. ధర్మారావు అడిగిన ప్రశ్న యిప్పుడు జ్ఞాపకాని కొచ్చింది వాసుకి. ఏరుదూరమైనా రావల్సి వచ్చిం దిప్పుడు... ఆ యిసుక తిన్నెల్లో కూర్చున్నంత సేపూ యేవో తనకు వచ్చేపాటి పాటలు

# పిల్లల కమాన

ఇంకా నేను నిద్రమంచంమీద నుండి లేవనేలేదు. ఇంతలో మా పిన్ని నన్ను లేపి "లతా ఇంకా ఎంతసేపు నిద్ర, అమ్మకు పురుడు వచ్చింది. నీ బుల్లి తమ్ముడిని చూద్దుగానిరా" అంటూ సంతోషముతో నన్ను ఎత్తుకొని పురిటి గదిలోకి తీసుకవెళ్లింది. అక్కడ అంతా హడావిడిగావుంది. ఇరుగు, పొరుగువాళ్లు, చుట్టాలు, స్నేహితులువచ్చి అమ్మని, తమ్ముణ్ణి, చూచివెడుతున్నారు. నేను దగ్గరకు వెళ్లి చూచాను. చిన్న చిన్న కాళ్లు చేతులు ఆడిస్తూ, పచ్చటి శరీరము నల్లని జుట్టు బుల్లినోరు, తమ్ముడు ముద్దు వస్తున్నాడు.

అందరు తమ్ముణ్ణిగురించే మాట్లాడుతూ ఉన్నారు. మా ఇంటి ప్రక్కవిడ నాకేసిచూసి "లతా నీ పని అయిందిలే. నీ ఆటలు ఇంక సాగవులే ఇంక నువ్వు మా కొద్దు. మీ తమ్ముడినే ఆదరిస్తాం" అంది నవ్వుతూ. నా మనస్సు చిన్నబోయింది. నా సంతోషము మరుక్షణమే మాయమైంది. నేను అయిదు సంవత్సరాలనుంచి ఆక్రమించిన స్థానం ఈనాడు ఈకొత్త తమ్ముడు ఆక్రమించుకొని, నన్ను అమ్మ నుండి వేరుచేస్తూన్నట్లనిపించింది. అమ్మ తనదేఅయినట్లు గుప్పిట్లు పట్టుకున్నాడు. నాకు గట్టిగా ఏడ్వాలనిపించింది. అక్కడనుంచి చల్లగా జారి యివతలకు వచ్చేసేను.

చిన్నబోయి ఒంటరిగా ముందు గదిలోకి పోయేను. ఒక తెల్లటి పిల్లికూన అక్కడకువచ్చి నా విచారాన్ని పోగొట్టింది. నాసంతోషానికే ఈపిల్లికూనని దేవుడు పంపించినట్లనిపించింది. మా అమ్మ తమ్ముడిని

**నిమ్మగడ్డ స్వర్ణలత**

ఆడిస్తూ ముద్దు పెట్టుకుంటే, నేను ఈ పిల్లిపిల్లను ఆడిస్తూన్నాను. నాసంతోషాన్ని పట్టలేక నా పుస్సీని (పిల్లికూన) అమ్మకు చూపిద్దామని తీసుకువెళ్లాను. అమ్మ నన్ను పుస్సీని, తమ్ముణ్ణి ఒక్కమాటు చూచింది. ఆరోజునుంచి అమ్మకు మేము ముగ్గురమూ సంతానమే అన్నట్లు చూచింది.

పిల్లికూననుచూచి మొదట మానాన్నగారు రోజు పిల్లిదర్శనం మంచిదికాదని కోప్పడ్డారు. కాని పుస్సీ 'మ్యావ్-మ్యావ్' అంటూ ఆయనచుట్టూ తిరిగేటప్పటికి, ఆయన హృదయంకూడా కరగిపోయింది. దానికి రోజూ భోజనం పెట్టేవారు. నిత్యం దానికి మాతో సహపంక్తి భోజనం అలవాటయింది. భోజనం చేశ నాకిష్టమైతే మూగో[illegible] కు నేదాన్ని. మజ్జిగ పోసుకోవడం తడువుగా 'మ్యావ్' అంటూ మూతి దగ్గర పెట్టేది.

పుస్సీనివదలి ఒక్కక్షణంకూడా వుండలేకపోయేదాన్ని. మా అమ్మ తమ్ముణ్ణి అలంకరిస్తే, పుస్సీ నాదగ్గర ముస్తాబు అయ్యేది. రాత్రి నిద్రపోయేటప్పుడుకూడా మెత్తగా, వెచ్చగా బుల్లిబొజ్జమీద పడుకోపెట్టుకొనేదాన్ని. పుస్సీని ఒంటరిగా వదలి ఎక్కడకి వెళ్లడానికీ నాకు మనస్సు ఒప్పేదికాదు. నేను లేకపోతే దానిని ఎవరైనా ఎత్తుకుపోతే, ఏ కారు క్రిందకాని పడితే, ఏకుక్కనా దాన్ని చంపేస్తే—నేను ఎల్లా బ్రతకగలను అనిపించేది.

ఆరోజు దసరా పండుగ. మా అమ్మ సేమ్యాపాయసం, ఆవడలు చేసింది. అమ్మ పేరంటానికి పిలుచుటకు వెళ్లినది. తిరిగి వచ్చేసరికి పిల్లికూన పాయసం, ఆవడలు, అంతా వలకపోసి నాకుతూంది. మాఅమ్మకు చాలాకోపమువచ్చింది. నేను చిన్నబోతానని మా నాన్నగారు ఏమీ అనకుండా ఊరుకున్నారు.

మాపిన్ని పెళ్లిట. శుభలేఖ వచ్చింది. పిన్ని అంటే నాకెంతో, ఇష్టము. మా అమ్మ పురిటికి వచ్చినప్పుడు నన్ను పుస్సీని ఎంతో ప్రేమగా చూచేది. పుస్సీనికూడా పెళ్లికి తీసుకువెళ్లాలి అనుకున్నాను. 'మనము పెళ్లికి వెళ్లి వచ్చేవరకు పుస్సీని ఈ ఊరిలో అత్తయ్యగారింటో నుంచుదాం' అంది మాఅమ.

## వాసు చదువు

పాడుకుంటూ ఆనందించే వాడు. ఇలా ఓ వారందినాలు గడిచిపోయాయ్. జీవితం నిస్సారంగా, భారంగా గడుస్తున్నట్టుగా భావించే వాడు వాసు. కాని తనేంచేస్తాడు?

"పుస్సీని మనతోనే తీసుకు వెళ్లాల"ని నేను పట్టు పట్టేను. "పెళ్లికి వెడుతూ పిల్లిని చంకనెట్టుకొని వెడతారా" అని నాన్నగారు అన్నారు. ఇంక విధిలేక పుస్సీని మా అత్తయ్యగారింట్లో ఉంచేను, జాగ్రత్తగా చూస్తూండమని మరిమరి చెప్పేను. అప్పుడు నాకు ఏడుపు వచ్చింది. పుస్సీ కళ్లుకూడా నీళ్లతో మెరుస్తూంటే మ్యావ్ - మ్యావ్ అని ఒకటే ఏడుపు. పెళ్ళికి వెళ్ళి పది రోజులు హాయిగా గడపి వచ్చాము. తిరిగివచ్చి పుస్సీని తెచ్చుకుందామని అత్తయ్య ఇంటికి వెళ్లేను నా పుస్సీ ఏమి బెంగపెట్టుకుందో అని భయపడుతూ వెళ్లేను. వెంటనే చెడువార్త నాచెవిని పడనే పడింది. ఆ యింటివారి కుక్క పుస్సీని ఎగబడి పొట్టనెట్టుకుందిట. నిలువునా నీరైపోయాను. నానోట మాట రాలేదు. మా అత్తయ్య నన్ను ఎంతో ఓదార్చింది. మూడు రోజులవరకు ఒళ్లు ఎరుగని జ్వరం. పుస్సీ, పుస్సీ అని అస్తమానం పలవరింతలు. 'నువ్వు నీ తమ్ముడినే ప్రేమించటము మంచిది. జంతువులతో నీకు ఇంత అధిక ప్రేమ ఉండడం మంచిది కాదు. జరిగినది మంచికే' అని ఎవరో సందేశమిచ్చినట్లు అనిపించింది. అప్పటినుండి క్రమంగా మా తమ్ముణ్ణే ప్రేమించడం మొదలు పెట్టేను.

ఇప్పటికీ మా మేనత్త అంటూనే ఉంటుంది: "కోడలా నీ పుస్సీని మా పప్పీ చంపిందని కోపమా? మాయింటికే రావడం మానుకొన్నావు. మా అబ్బాయిని పెళ్లాడుతావా?"

ఏంసమాధానం చెప్పాలో ఇంకా ఆలోచిస్తూనే వున్నాను. ★

# ప్రమాదవశాత్తు మరణించింది!

(35-వ పేజీ తరువాయి)

సహజప్రవృత్తుల్ని అణగద్రొక్కుకున్నప్పుడు వాటిని మంచిమార్గాల్లోకి సబ్లిమేట్ చెయ్యకపోతే, ఇలాంటి విషమపరిణామాలకు దారితీస్తాయి.

ఎన్ని కష్టాలన్నా భరించింది గాని, ఈ బాధని చంద్రకాంత సహించలేకపోయింది.

రాత్రి భర్త కాళ్ళమీద పడి, ఏడ్చి, విషయమంతా పూసగ్రుచ్చినట్లు చెప్పింది.

"ఏతే నన్నేం చెయ్యమంటావ్? నీకోసం మావాళ్ళతో తగవులాట ఎక్కడ పెంచుకోను? ఏదో నీచాకచక్యంతో నువ్వే సర్దుకుపోవాలి. అయినా ఎప్పుడూ ఆడవాళ్ల మానాన్ని రక్షిస్తో కూచోడమేనా మా పని? ఎవరిమానం వాళ్ళు కాపాడుకోవాలంతే!" అని కసిరాడు.

చంద్రకాంత కన్నీటితో తడిసిన తలగడా తన గుండెల్లో దాచుకుంది.

* * *

వారంరోజుల పనిమీద సర్వేశ్వరరావు బొంబాయి వెళ్ళడంతో కథ క్లయిమాక్సు అందుకుంది.

ఆ వారంరోజుల్లోనే తండ్రీ కూతురూ, చంద్రకాంతమీద కసితీర్చుకున్నారు. ఒక నాటి రాత్రి ఆ యింట్లో బిగ్గరగా ఏడుపులూ, పెడబొబ్బలూ, పిడిగ్రుద్దులూ వినపడ్డాయి ఇరుగుపొరుగువారికి. మరునాడు పొద్దున్నే వాళ్లకి నీళ్ళూ, కాఫీ సిద్ధమవలేదు. వీధికూడా శుభ్రంకాలేదు.

ఇంకా లేవలేదనుకుని చంద్రకాంత గదిలోకి వెళ్లారు. ఆమె అక్కడ లేదు.

ఇంటిల్లిపాదీ లేచి ఇల్లూ, దొడ్డీ, బావీ వెతికారు. కాని కనపడలేదు.

చివరికి ఊరిబయట చెర్లో దొరికింది చంద్రకాంతశవం.

ఆ దృశ్యాన్ని ఇప్పటికీ మరువలేను. నిర్మలమైన ఆమె మొహంమీద ముత్యాల్లా మెరిసే నీటిబిందువులూ, నల్లని ముంగురులూ, వాడని ఆ తేజస్సు, చంద్రబింబం వంటి కాంతీని.

తర్వాతకథ ఊహించుకోలేనంత కష్టమైందికాదు.

శవపంచాయతీలో "ప్రమాదవశాత్తు మరణం" పొందినదని తేలింది.

"మా వంశానికి తీరని కళంకం తెచ్చింది, పాతకి" అని ఆ కుటుంబీకులు ఇప్పటికీ ప్రచారం చెయ్యడం మాత్రం నిజం! ★



విజయావారి "మిస్సమ్మ" లో నాయికా నాయకులు ఎన్. టి. రామారావు, సావిత్రి.

## "కాళహస్తి మహత్యం"

గుబ్బి కర్నాటక ప్రొడక్షన్స్‌వారి "కాళహస్తి మహాత్యం" ఈ నెల 12 న విడుదలవుతుందని తెలుస్తోంది. ఇందులో లింగమూర్తి, ఋష్యేంద్రమణి, రాజసులోచన, మాలతి, కుమారి, రాజకుమార్, పద్మనాభం మున్నగువారు నటించారు. దర్శకుడు హెచ్. ఎల్. ఎన్. సిన్హా. మాటలు, పాటలు వ్రాసినవారు తోలేటి. ఆంధ్ర దేశంలో ప్రసిద్ధ పుణ్యక్షేత్రాల్లో ఒకటైన కాళహస్తికి సంబంధించిన స్థలపురాణాన్ని, కన్నగు అనే బోయి భక్తుని జీవితగాథను ఈ చిత్రం చూపిస్తుంది.

## భారతీయ చిత్రాలకు అమెరికన్ మార్కెట్

భారతీయ చిత్రాలకు అమెరికన్ మార్కెట్‌లో ప్రవేశం దొరకడం దుర్లభం అని ఇటీవల అమెరికాలో పర్యటించి వచ్చిన బొంబాయి ప్రొడ్యూసరు, డైరెక్టరు హోమీవాడియా ప్రకటించాడు. హాలీవుడ్, న్యూయార్క్ మొదలైన నగరాల్లో కొన్ని వారాలుండి, కొందరు ఫిలిం వ్యక్తులను కలుసుకొన్న మీదట ఆయన అమెరికన్ థియేటర్లలో ప్రదర్శింపబడినప్పటికీ భారతీయ చిత్రాలకు ప్రోత్సాహం లభించదనే నిర్ణయానికి వచ్చాడు.

అమెరికన్ మార్కెట్ అమెరికన్ చిత్రాలతోనే నిండిపోతున్నందున విదేశీయ చిత్రాలను ప్రజలు చూడాలనుకున్నప్పటికీ డిస్ట్రిబ్యూటర్లు వాటిమీద అంతి ఆసక్తి చూపడం లేదని ఆయన అన్నాడు. అమెరికన్ చిత్రాలకంటె మన చిత్రాల స్థాయి తక్కువైనందువల్ల వాటిని అక్కడ చూపించడం లేదనే మాట అబద్ధమనీ, మన చిత్రాలకంటె తక్కువ స్థాయి కలిగిన అమెరికన్ చిత్రాలను చాల వాటిని తాను అక్కడ చూశాననీ, అటువంటి వాటిని వారు పైదేశాలకు పంపించడం లేదనీ ఆయన అన్నాడు. హాలీవుడ్ చిత్రాలు అనేకం ఇండియాలో ప్రదర్శింపబడుతున్నందువల్ల, మన చిత్రాలుకూడా అమెరికాలో ప్రదర్శింపబడడానికి వీలుగా ఉభయప్రభుత్వాలు సంప్రదించి 'కోటా' పద్ధతి ఏర్పాటు చేసుకోవాలని హోమీవాడియా సూచించాడు.

## ఝాన్సీకి రాణి

టెక్నికలర్ చిత్రం "ఝాన్సీకి రాణి"ని అమెరికాలో విడుదల చేసే సందర్భంలో ఆ చిత్రం నిర్మాత సొహ్రాబ్ మోడీ ఈ నెలలో అమెరికా వెడతాడని తెలుస్తోంది. ఈ చిత్రానికి ఇంగ్లీషులో "టైగర్ ఎండ్ ది ఫేమ్" అని పేరు పెట్టారు. అమెరికన్లకు కొంచెం ఘాటైన పేర్లంటే తప్ప నచ్చదని కాబోలు ఉదాత్తమైన ఇతివృత్తంగల ఆ చిత్రానికి ఆ పేరు పెట్టారు.

కృష్ణాపిక్చర్సవారి "విజయగౌరి" లో బంగారు (సురభి బాలసరస్వతి) వీరసింహుడికి (గుమ్మడి) అతిముఖ్యమైన రహస్యం వెల్లడిచేస్తోంది.

## ఉదయశంకర్ కొత్తచిత్రం

వేదకాలంనుండి ఈనాటివరకూ భారతీయ నృత్యకళ ఎలాటి పరిణామాలు పొందుతూ వచ్చిందో చూపించే చిత్రం తీయడానికి కలకత్తాలో మ్యూజికల్ ఫిలిమ్స్ ఆఫ్ ఇండియావారు సంకల్పించారట. ప్రఖ్యాత నర్తకుడు ఉదయశంకర్ నృత్యదర్శకుడుగా ఉండి, చిత్రంలో ప్రధాన పాత్ర ధరిస్తాడట. బెంగాలీ సంగీత దర్శకుడు జ్ఞానప్రకాష్ ఘోష్ సంగీతం రచిస్తాడు. ఉదయశంకర్ ఇదివరలో "కల్పన" అనే నృత్య చిత్రం తీసి విమర్శకుల ప్రశంసలు పొందాడు.

## లండన్‌లో "రాహి"

కె. ఎ. అబ్బాస్ నిర్మించిన "రాహి" చిత్రం ఇంగ్లీష్ వర్షన్ ఇటీవల లండన్‌లో ఏషియాన్ ఫిలిమ్ సొసైటీవారిచే ప్రదర్శింపబడింది. ముల్క్‌రాజ్ ఆనంద్ కథ ఆధారంగా తీయబడిన ఈ చిత్రం బ్రిటిష్ ప్రేక్షకులు మాసి, అందులో బ్రిటిష్ వ్యతిరేక ప్రచారం కొంత ఉందని భావించారట. టెక్నిక్ వగైరాల్లో మాత్రం అది భారతీయ చిత్ర పరిశ్రమకు పేరు గడించేదిగానే ఉందని అనుకున్నారట. ఆ ప్రదర్శనకు రాజకీయజ్ఞులు, బ్రిటిష్, ఇటాలియన్ సినిమా వ్యక్తులు పలువురు హాజరయారు. అప్పుడే రష్యానుండి తిరిగివచ్చిన దేవ్ ఆనంద్ కూడా దానికి హాజరైనాడట.

రష్యాలో పర్యటించిన భారతీయ ఫిలిం వ్యక్తులు దీపావళినాటికి స్వదేశం వచ్చేశారు. బిమల్ రాయ్, విజయభట్, మున్నగువారు తమ రష్యన్ పర్యటన, అక్కడ తమకు రష్యన్ ప్రభుత్వమూ, ప్రజలు ఇచ్చిన ఆతిథ్యం మరువరానివిగా ఉన్నాయని అన్నారు. వారి పర్యటన వివరాలను రష్యన్లు మూవీ కామెరాతో ఫొటోగ్రాఫ్ చేశారట. అదంతా ఒక డాక్యుమెంటరీగా చేర్చి, విడుదల చేస్తారట.



# "మేనరికం"
## ప్రేక్షకుల అభిప్రాయాలు

"ఆమ్మయ్య! ఎన్నాళ్లకయిందీ మేనరికం!" అని జంపనవారు అనుకున్నా, నటీనటులచేత అనిపించినా, ప్రేక్షకులు అన్నా, కలిసిన సంబంధం! ఎప్పుడు చేస్తేనేం? మధ్యలో ఎన్ని ఒడుదుడుకు లొచ్చినా కావల్సిన సంబంధం చేయడంకంటె వేరే సుఖముంటుందా మరి? అయిన సంబంధం గనుక ఏవో చిన్నా పెద్దా లోపాలున్నా సులువుగా సర్దుకుపోతాయిగా! పై సంబంధం చేస్తే అది లోపం, యిది లోపమంటూ అన్నీ లోపాలేగా! అందుకనే కలకాలం సుఖపడాలంటే కావలసిన సంబంధం చేసుకోమన్నారు పెద్దలు.

అలా, చేసుకున్నారు కనుకనే జంపనవారు సుఖపడిపోయారు! మేనరికం అన్ని విధాలా బాగుంది. అందు కానందించాల్సిందే. మేనరికం మొదటినుంచి చివరిదాకా అత్యుత్తమమైన సన్నివేశాల్తో హృదయాలను కదలింపజేసేదిగా వుంది. కథ చాలా రసవత్తరంగా వుంది. మాటలు, పాటలు చక్కటి విధానంలో వున్నాయ్. దర్శకత్వం ఉత్తమంగావుంది సంగీతం కూడా విన సొంపుగావుంది. ఇక నటీనటుల విషయంలో జి. వరలక్ష్మి, నారాయణరావు, మిక్కిలినేనిగార్ల నటన అమోఘంగా, అత్యుత్తమంగావుంది. వీరి ముగ్గురిలో ప్రత్యేకంగా నారాయణరావును అభినందించాలి. రామశర్మ నటన ఏమీ బాగులేదు. మిగిలినవారందరూ జాగ్రత్తగానే నటించి తమ పాత్రలను బాగానే పోషించారు. ఫొటోగ్రఫీ, సౌండు మొదలయిన యితర టెక్నికల్ విషయాలు మొత్తంమీద లోపం లేకుండానే వున్నాయి. చిత్రం నిడివి యింకా తగ్గించటానికి అవకాశాలున్నాయి. చిత్రమంతటా అన్ని రసాలూ నేర్పుగా యిమిడ్చారు జంపనవారు. చిన్న చిన్న లోపాలున్నా అవి ఆట్టే అడ్డుతగిలేవి కావు. మేనరికం తప్పకుండా ప్రజాదరణ పొందదగు చిత్రం. జంపనవారు పూర్తిగా ప్రశంసార్హులు.

పరుగెట్టి పాలు త్రాగేకంటె, నిలబడి నీళ్లు



వాహినీవారి "బంగారు పాప" లో కారెక్టర్ యాక్టర్ ఎస్. వి. రంగారావు.



అశ్వరాజ్ వారి "అన్నదాత" లో సావిత్రీ సత్యవంతుల నాటక ఘట్టంలో యమ పాత్రధారిగా (అభినవ గగ్గయ్య) యస్. వి. రంగారావు.

ప్రోగడం మంచిదన్నట్టు, నిర్మాణం ఆలస్య మయినా దక్కని చిత్రం నిర్మించారు.

వ్రాడేవు గవర్రాజు.

* * *

కథలో కంటిన్యూయిటీవుండి ప్రేక్షకులకు విసుగనిపించలేదు. కాని చిత్రం విడివి రెండువేల అడుగులు తగ్గించినా కథకు ఏమాత్రం నష్టంలేదు. అనవసరమైన సీన్లు చాలా వున్నవి. జంపన, డైరెక్షనులో చాలావరకు ముందుకు వచ్చారు. కాని కొన్నిచోట్ల దెబ్బతిన్నారు. వి. యన్. రెడ్డిగారి ఫోటోగ్రఫీ కొద్దిసీన్లలో కనిపించినా చాలా అమోఘంగా వుంది. ఆసీన్లు విడిగా కనుపిస్తవి. పెండ్యాలవారి సంగీతం కొంతవరకు బాగున్నది. కానీ చాలచోట్ల హిందీ అనుకరణ చేశారు. మేకప్‌లో చాలా లోటుపాట్లున్నవి. పిక్చరు చివరంటూ ఆ లోటుపాట్లు కనుపిస్తవి. ఉదా: కొన్ని సీన్లలో ముసలిరూపుగా తల నెరసి ముడతలు పడినట్టుఉండి ఇంకొకసీనులో పడుచురూపు కనుపించడం, ఇత్యాది. ముఖ్యంగా, శివరామ్, చంద్రశేఖర్, వీళ్లకి బాగా కనుపిస్తుంది ఆ తేడా. వరలక్ష్మి నటన, కన్నతల్లి, దీక్షను గుర్తుకు తెస్తున్నది. రామశర్మ నటన మామూలే. నారాయణరావు, రేలంగి, చంద్రశేఖర్, నటన పర్వాలేదు. శివరామ్, అసలు అనవసరం. మిక్కిలి సేనికూడా పర్వాలేదు. నాగయ్య అయితే ఇంకా చాలా అద్భుతంగా నటించేవాడు. సూర్యకాంతం నటనలో ముందడుగు వేసింది. ప్రతిప్రేక్షకునికి కథ వచ్చుతుంది కనుక దెబ్బ తీసుకోవద్దు.

వి. చెంచయ్య—బందరు.

* * *

చిత్రములో ముఖ్యముగా చెప్పుకో దగింది వి. యన్. రెడ్డిగారి ఫోటోగ్రఫీ ప్రతిభ. సెట్సు అలంకరణలుగూడా చాల సహజ వాతావరణాన్ని సృష్టించాయి. కాని కొన్నిలోపాలు, సందేహాలు స్ఫురిస్తాయి. ఉదాహరణకు, రెండు రైలుయింజనులు ఢీకొనునపుడు మొదట ఎడమనుండి కొనెడియన్ యింజనుబండి వస్తుంది. కుడినుండి యింకొక మీటర్‌గేజ్ యింజను వస్తుంది. కాని ఢీకొన్నపుడు రెండూ కెనెడియన్ యింజనులే. తన అల్లుడు జైల్లో వున్నాడని కూతురువల్ల వినికూడా వీరయ్య,

##  ప్రేక్షకుల అభిప్రాయాలు 

భక్తుణ్ణి శిలాగైనా శైలునుండి విడిపించుటకు ప్రయత్నం చెయ్యడు. బహుశా చూచిన దృశ్యాన్నిబట్టి మిగతా జరిగింది ప్రేక్షకులే ఊహించుకోవాలని జంపనగారి ఉద్దేశ్యమేమో? తరువాతి ముఖ్యవిషయం, చిత్రం నిడివి దాదాపు 17 వేలుంది. కొన్ని సంఘటనలు తగ్గించినట్లయితే కొండవీటి చాంతాడులాగా కాక క్లుప్తంగావుండి ప్రేక్షకులను రంజింపచేసేది. ఉదాహరణకు రాజా శారదల ప్రణయ సన్నివేశాలు, పాటలు తగ్గించవచ్చు. అప్పనకొండ, తలుపుల హాస్యసంఘటనలు తగ్గించవచ్చు. జంపనగారి పాటలు మాటలు రక్తివంతంగా ఉన్నాయి. సంగీతము వీనులవిందుగా వుంది.

ఇక నటుల విషయం. మిక్కిలినేని నటన మెచ్చుకోదగినదిగా యున్నా, కొన్నిచోట్ల నాటకీయంగా ఉంది. జోగారావు తన హాస్యనటనతో ప్రేక్షకుల రంజింపచేసి ఉత్తమస్థానమును సంపాదించుకొన్నాడు. ఇక రేలంగి విషయం చెప్పనక్కరలేదు. జోగారావు, రేలంగి చిత్రానికి ప్రాణంపోశారు. నారాయణరావు నటన అత్యుత్తమంగా నున్నది. సావిత్రి, రామశర్మ, సూర్యకాంతం మామూలుగా నటించారు. మన టాం టాం (శివరామ్) అనవసరం. కాని మొత్తముమీద చిత్రము బాగానేవుంది. జంపనగారు యీసారి మరొక మనోరంజక చిత్రాన్ని ప్రేక్షకలోకానికి అందిస్తారని ఆశిస్తా.

పల్లపోతు సత్యనారాయణరావు

—విజయవాడ.

* * *

"ఎప్పటినుండియో విశేష శ్రమనొంది తయారుచేసిన యీ చిత్రం, ఎప్పుడు విడుదలౌతుందా అని ఎదురుచూసే ప్రేక్షకులకు తృప్తినిచ్చింది. ప్రతిసంసారంలో నేడు వదినా, ఆడబడుచులమధ్య జరుగుచున్న విషాదసంఘటనలు కళ్లముందు చూపించారు. ఈ చిత్రంలో సీతగా జి. వరలక్ష్మి. ధర్మంగా నారాయణరావు ఎంతో నేర్పుతో నటించారు. రేలంగి పుల్లయ్యగా, సూర్యకాంతం రేలంగి పెళ్లాం కామమ్మగా చాలా

"కాళహస్తి మహాత్మ్యం" లో తన కన్ను పెరుక్కొంటున్న భక్తుడు

బాగా ఒప్పించారు. కానీ రేలంగి ఓవర్ యాక్షన్ అంత బాగుగాలేదు.

హాస్యనటనలో జోగారావు అప్పల కొండగా, సీత తలుపులుగా ఎంతో చక్కగా నటించి ప్రేక్షకులను రంజింప చేశారు. రమేష్‌గా చంద్రశేఖర్ కూడా బాగానే నటించాడు. ధనంతో కళ్లుకానక అహంకారం ఎక్కువైన ధనవంతులకు ప్రేమా, అనురాగం, మానవత్వం అంటే ఏమిటో ఈ చిత్రం తెలియపరచింది.

ఈ చిత్రానికి మాటలు, పాటలు జంపనవారే వ్రాశారు. మాటలు పలికించడంలో అక్కడక్కడ సందర్భానికి దగ్గరగా లేకుండా పలికించారు. పాటలు బాగున్నాయ్. పెండ్యాలవారి మ్యూజిక్ కమల్‌ఘోష్‌గారి ఛాయాగ్రహణం, గోడగాంకర్‌గారి ఆర్టు చాలా బాగున్నాయ్. ఎన్నో రోజులనుండి కష్టపడి తీసిన యీ చిత్రం ప్రజారంజకంగా వుందంటే అదంతా జంపనవారి కృషి ఫలితమే నని చెప్పకతప్పదు. ఈ చిత్రానికి దర్శకత్వం వహించిన జంపనవారు ఎంతో ప్రశంసనీయులు.

కె. ఎ. సత్యనారాయణ,

—తణుకు.

* * *

జంపనవారుపడిన రెండేండ్లకష్టానికి ఫలితం లభించిందనుకోవచ్చు. చిత్రంలో కథ బాగానే నడచింది. మిక్కిలినేని పాత్రకు నాగయ్యను బుక్ చేసివుంటే చిత్రం ఇంకా చాలా రాణించేది. రేలంగి, జోగారావుల హాస్యం చక్కగా వుంది. రాజుగా రామశర్మ కృతార్థుడు కాలేకపోయాడు. మిగత నటులు, వరలక్ష్మి, సూర్యకాంతం, సావిత్రి, నారాయణరావు బాగా నటించారు. సంగీతంలో చెప్పుకోతగ్గ ప్రత్యేకత ఏమీలేదు. ఫోటోగ్రపి ఆహ్లాదకరంగావుంది.

కనుపర్తి విఠల్‌రావు—నెల్లూరు.

* * *

ఈ చిత్రం ప్రారంభించుటలోకాని, సమాప్తి చేయుటలోకాని క్రొత్తదనం లేకపోవుటచేత కొంత విసుగు కల్గిస్తుంది. మాటలకంటే అక్కడక్కడ పాటలే బాగున్నాయి. ధర్మంగా నారాయణరావు తన పాత్రను అందరికంటే గొప్పగా పోషించారు. వీరి నటన చిత్రవిజయానికి తోడ్పడవచ్చును.

తరువాత జి. వరలక్ష్మి, సూర్యకాంతం సీతల నటనలు చెప్పుకోదగినవిగా వున్నవి. హాస్యములో రేలంగి ఒక మోస్తరుగా రాణించినా, పేకేటి, జోగారావుల పాత్రలు దండుగనిపిస్తాయి.

ఆకలిచే ఏడ్చే బిడ్డకు తెచ్చినపాలు నేలపాలగుట, ధర్మం పాలడబ్బాను తెచ్చువప్పటికి అతని బిడ్డ చనిపోవుట మున్నగు ఘట్టాలు ప్రేక్షకుల హృదయాలను కదిలిస్తాయి. ఇలాగే కొన్ని అసహజ ఘట్టాలు లేకపోలేదు. ఉదా॥ ఆదర్శవాదియైన ధర్మం పోలీసులనుండి రైలుప్రమాదములో తప్పించుకొనుట, సీత రాటమువడకి తన కొడుకు ప్రభును చదివిస్తుంటే ప్రభు విలువయిన ట్వీడ్ దుస్తులతో తయారవడం మున్నగునవి. ఇలాగే "మత్తెక్కి తుమ్మెదలారా" అనే పాటలో పుష్పంమీదవ్రాలిన సీతాకోక చిలుకలను చూపించుటలో అర్థం లేదు.

నౌకరు అప్పలకొండ, తలుపుల్ని కూర్చొబెట్టి ఉపన్యాసమిచ్చే చోటా, శారద పొట్లం విప్పగనే రేజర్ వుండే చోట హాస్యం బాగావుంది. శబ్దగ్రహణం కొన్నిచోట్ల సరిగా లేకపోవటంవల్ల మాటలు కొన్ని అర్థంకావు.

ఎల్. వి. కృష్ణారెడ్డి.

—నెల్లూరు,

# విజ్ఞానవీధులు

## "డాక్టర్"

లాడె గంగరాజుగారు, గుణుపురం.

—సహజపద్ధతులవలన - మందు త్రాగించడము వంటి కృత్రిమ పద్ధతులవల్ల కాకుండా - రోగనివారణ చేసే పద్ధతిని 'నేచురోపతీ' అంటారు. తొట్టి స్నానము ఈ పద్ధతికి ముఖ్యము.

పి. యస్. యన్. రావుగారు,

గజపతినగరము.

—ఆకాశానికీ భూమికీ గల అంతరాళంలో పదార్థాలేవీ లేవు. మహావుంటే ఉదజని పరమాణువులు అక్కడ ఒకటీ అక్కడ ఒకటీ వుంటాయి. సూర్యుడు చిమ్మే ఎలక్ట్రానులు కూడా సకృత్తుగా ఉండవచ్చును.

ఉష్ణమునకూ, వెలుతురునకూ వాహనములు అక్కరలేదు. వాటి అవకాశము గుండా అవి ప్రసరించగలవు.

జి. వి. రత్నంగారు, వాల్తేరు.

—సూర్యునికీ భూమికీ నడుమ చంద్రబింబము అడ్డువచ్చినప్పుడే సూర్యగ్రహణము కలుగును. సూర్యబింబము చంద్రునికంటే చాలా పెద్దది. కనుక చంద్రబింబము అడ్డురావడమువల్ల ఏర్పడ్డనీడ భూమి నంతటినీ కప్పలేక భూమిమీద కొంత భాగము మీదనే నీడగా పడును. ఈ నీడ పడినంత మేరలోనూ సూర్యుడు కానరాడు. అనగా అక్కడే సూర్యగ్రహణము పట్టును.

టి. కృష్ణమూర్తిగారు, పూరి.

—యురేనియమూ, తోరియమూ యాక్టినియమూ అనే మూలపదార్థాలమండి ఆల్ఫా, బీటా, కణములూ, గామా కిరణములూ అవిచ్ఛిన్నముగా వచ్చుచుండును. ఈ కణములూ కిరణములూ మన శరీరానికి పదేపదే సోకితే అక్కడ గాయమౌతుంది. ఈ గాయాలు ఒకంతట మానవు, మరణకారణాలు కూడా కావచ్చును. ఆటం బాంబు పేలినప్పుడు ఈ రేడియో ధార్మికత్వముగల దుమ్ము అపరిమితంగా విరజిమ్మబడుతుంది. స్వతహాగా ఈ గుణము లేకపోయినా బాంబు ప్రేలినప్పుడు ఏర్పడే విపరీత పరిస్థితుల—ఉష్ణమూ, ఒత్తిడీ—వల్ల సామాన్య పదార్థాలుకూడా రేడియో ధార్మికతను సంపాదించుకుంటాయి. గాలీ, నీటి ప్రవాహము వీటిని...బాంబు పేలిన చోటనుంచి - సుదూరము తీసుకుపోతాయి. అక్కడంతా జీవజంతువులకు దుర్గుణాలు కనపడతాయి.

బి. నారాయణరావుగారు, కసుకుర్రు.

—విద్యుత్ప్రవాహము అంటే ఎలక్ట్రానుల ప్రవాహము మాత్రమే కాదు. ధనవిద్యుదావేశితములగు ప్రోటానుల ప్రవాహము కూడా విద్యుత్ప్రవాహమే. కనక ఎలక్ట్రిక్ షాక్ తిని పడినవారికి ప్రోటాను ప్రవాహము స్పృహ తెప్పించలేదు. ఎలక్ట్రిక్ షాకువల్ల శ్వాసకేంద్రము ఆగిపోతుంది. అందుకని కల్పితశ్వాసపద్ధతులవల్ల మళ్లీ శ్వాసకార్యము జరిపించడానికి యత్నిస్తారు.

—జీవ పదార్థానికీ జడపదార్థానికీ ఒక్క తేడా ఇదీ: జీవపదార్థాలు ఆక్సిజను, నైట్రొజను, కర్బనము, ఉదజనీ చేరి ఏర్పడ్డ అణువుల సమూహాలవల్ల ఏర్పడతాయి. జడపదార్థాలలో ఈ కూడిక ఉండదు. మెదడు కూడా ఈ క్లిష్ట సంయోగమే ఒక ప్రత్యేక రకముగా ఉంటుంది.





మాస్ ఫిలిమ్" స్టూడియోలో (మాస్కో) నిరూపరాయ్, రాజ్‌కపూర్, నర్గిస్, బిమల్ రాయ్, దేవ్ ఆనంద్
"ఇల్యామురో మెట్స్" అనే కొత్త సోవియెట్ ఫిలిమ్‌కు సంబంధించిన సీనరీ స్కెచ్ లను
సోవియెట్ డైరెక్టరు ఎ. పుటుష్కో భారతీయ అతిథులకు చూపిస్తున్నాడు.



ఇటీవలి విడుదలైన జయంతీవారి "బంగారు భూమి" లో టి. ఆర్. రామచంద్రన్, మైనావతి.



చితుకుల బ్రతుకు

—ఫొటో : ఎమ్. వీరభద్రరావు—విజయవాడ.

# మీ ముఖమును మృదువుగ, మనోహరముగ, నవనవలాడేలా ఉంచుకొనుట ఎంతో సులభము!

మీ చర్మమునకు పాండ్స్ సౌందర్య రక్షణ యివ్వండి

ప్రసిద్ధిగాంచిన పాండ్స్ క్రీములు మీ చర్మమునకు అత్యుత్తమమైనవి: మీ పరిసరాల శీతోష్ణస్థితుల బాధలనుండి దానిని కాపాడును. ప్రపంచమంతటా సౌందర్యవతులవలె మీరూ ఈ క్రీముల సౌమ్యరక్షణతో మీ **ముఖమును** నవవికసిత పుష్పమువలె **ఉంచుకొనగలరు.**




పొడిగాలిగల శీతోష్ణస్థితి మీ ముఖ కాంతిని పాడుచేస్తే—పాండ్స్ కోల్డ్ క్రీమ్ మీకు అవసరము. దానిలోనున్న విశేష నూనెలు చర్మమునకు ఉపశమనము నిచ్చి తీక్షణమైన ఎండ, వడగాడ్పులతో అది వాడిపోకుండా కాపాడును.




మీ చర్మము సహజముగ జిడ్డుగా యుంటే లేక వేడి చెమ్మగల గాలిలో జిడ్డుగా అవుతూ ఉంటే—పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్ వాడండి. ఎంతో తేలికగా మరియు మంచువలెనున్న ఈ క్రీమ్ రోమరంధ్రాలను అడ్డిన జిగటను, నిర్జీవమైన రక్త కణములను అడ్డము తీసి, మీ ముఖమునకు సౌమ్య రక్షణ నిచ్చును.

## ప్రపంచములో సౌందర్యరాణులు వాడే క్రీములు

పాండ్స్ క్రీములను ప్రతిదినము తప్పక వాడి మీ చర్మములో వ్యత్యాసము చూడండి — కొన్ని రోజులలో మీ ముఖము ఎంతో నిర్మలముగ, మృదువుగ ఉండుట మీరు చూడగలరు—అనుభవించగలరు కూడ!

# పాండ్స్

కోల్డ్ క్రీమ్

వ్యానిషింగ్ క్రీమ్




P. 9946